# సాహితీస్రవంతి కర్నూలు జిల్లా కమిటీ ఆధ్వర్యంలో నంద్యాలలో అక్టోబర్ 20-21 తేదీలలో జరిగిన సాహిత్య కార్యశాల దృశ్యాలు




ప్రారంభ సభలో పాల్గొన్న మూర్తి, కెంగార మోహన్, డా. సీతారాం, కె. ఆనందాచారి, తెలకపల్లి రవి, క్రిష్ణారెడ్డి, మాదాల శ్రీనివాస్, డా. కళారవి




ప్రారంభ సభలో ప్రసంగిస్తున్న తెలకపల్లి రవి, నంద్యాలలోని క్రిష్ణారెడ్డి పి.జి.కళాశాల అధిపతి క్రిష్ణారెడ్డి, కవితా వస్తువు అంశాన్ని బోధిస్తున్న కె. ఆనందాచారి



కవిత్వ శిక్షణా శిబిరంలో అభ్యాసం చేయిస్తున్న డా. సీతారాం, ప్రిన్సిపాల్‌గా వ్యవహరించిన జంధ్యాల రఘుబాబు, సాహిత్య విమర్శపై ప్రసంగిస్తున్న డా.పి.ఎల్. శ్రీనివాస రెడ్డి, పాట-పరిణామం అంశంపై ప్రసంగిస్తున్న డా. కళారవి.



సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి నుండి సర్టిఫికెట్ అందుకుంటున్న నంద్యాల సాహితీస్రవంతి ప్రధాన కార్యదర్శి మాదాల శ్రీనివాస్

బాల సాహిత్యంపై ప్రసంగిస్తున్న కెంగార మోహన్, ఆత్మీయ సందేశమిస్తున్న వీరప్రసాద్ సభలో ప్రసంగిస్తున్న నంద్యాల సాహితీస్రవంతి అధ్యక్షుడు శ్రీనివాసమూర్తి

PRSVMO2A143

సాహిత్య ప్రస్థానం
సంపుటి : 11 నవంబర్ 2012 సంచిక : 11

# తెలుగు అమలు పెరగాలి

ఎట్టకేలకు తాపీగా మన రాష్ట్ర ప్రభుత్వం అధికార భాషా సంఘాన్ని నియమించింది. చాలాకాలంగా తెలుగు భాషా వికాసానికి కృషిచేస్తున్న మండలి బుద్ధప్రసాద్‌ను నియమించడంలో ప్రభుత్వం ఔచిత్యం ప్రదర్శించింది. అధికార భాషా సంఘానికి తగిన పర్యవేక్షణాధికారాలు ఇచ్చినప్పుడు ఈ నియామకానికి అర్థం ఉంటుంది. వివిధ విభాగాలలో తెలుగు అమలు చేయడంలో అధికార భాషా సంఘానికి సహకరించినప్పుడే ప్రభుత్వ చిత్తశుద్ధి బయటపడుతుంది. ప్రపంచీకరణ విధానాలలో భాగంగా విచక్షణా రహితంగా ఇంగ్లీషు భాష అంతటా ప్రవేశించి స్థానిక భాషల వికాసానికి అడ్డుతగిలింది. తగిన జాగ్రత్తలు తీసుకోవడంలో పాలకులు వైఫల్యం చెందారు. కనీసం తెలుగును ఒక పాఠ్యాంశంగా కూడా చదవకుండా మన విద్యార్థులు పైచదువులకు వెళుతున్నారంటే కేవలం ప్రభుత్వ నిర్లక్ష్యమే కారణం. కొత్తగా బాధ్యతలు చేపట్టిన అధికార భాషా సంఘం పాఠశాలల్లో తెలుగు చదవడం తప్పనసరి చేసేలా ప్రభుత్వం నిర్ణయం తీసుకునేలా ఒత్తిడి చేయాలి. త్వరలో ప్రపంచ తెలుగు మహాసభలు కూడా ప్రభుత్వం తలపెట్టింది. ఈ సందర్భాన్ని అవకాశంగా తీసుకుని మన భాషా వికాసానికి నిర్మాణాత్మక, ఆచరణాత్మక విధానాలను రూపొందించాలి. అన్నిస్థాయిలలో తెలుగుభాషను పూర్తిస్థాయిలో అమలు చేసేందుకు గట్టిగా పూనుకోవాలి. కొత్తగా నియమించిన అధికార భాషా సంఘం ఇటువంటి అంశాలపై దృష్టి పెట్టాలి. అందరి భాగస్వామ్యంతో భాషను అభివృద్ధి పరచడానికి శాస్త్రీయమైన కృషి జరగాల్సిన అవసరం ఉంది.

... ... ....

సాహితీస్రవంతి పలు జిల్లాల్లో నిర్వహిస్తున్న సాహిత్య కార్యశాలలకు స్పందన బావుంది. ఈ విధమైన కార్యక్రమాలు భాషా వికాసానికి ఎంతో దోహదం చేస్తాయి. వీటిని మరింత విస్తృతం చేయాల్సిన అవసరం ఉంది.

ముఖచిత్రం పెయింటింగ్ : జెరిమీ లొర్డా నొఫ్

బొమ్మలు : శివాజి, వెంకటేష్

## ఈ సంచికలో...

పునాది రాళ్ళ ప్రార్థన (కథ) ..... 2
కవిత ..... 5
ఇంద్రగంటి వారి ప్రతిమ ..... 6
సంస్పందనలు ఓల్గా కవితలు ..... 8
కవిత ..... 10
మధుర స్వప్నం (కథ) ..... 11
కవితలు ..... 16
కవిత్వంలో వస్తు వైవిధ్య అన్వేషణ ! ..... 13
కవిత ..... 15
జాతీయోద్యమం సంఘర్షణలు ..... 16
కవితలు ..... 21
ఆశాజీవి (కథ) ..... 22
సాహిత్యంలో నోబుల్ - సంభాషణ, ఇంటర్వ్యూ ..... 26
కవిత ..... 28
బొద్రాయి (కథ) ..... 29
కవితలు ..... 33
అమెరికా తెలుగు కథా సాహిత్యం ..... 34
కవితలు ..... 38
కొత్త పుస్తకాలు ..... 39
కవిత ..... 41
ఉత్సాహభరితంగా నంద్యాల సాహిత్య కార్యశాల ..... 42
డైరీ ..... 44
స్పందన ..... 45



చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్. 040-27635136,
ఇ.మెయిల్ : ssprasthanam@gmail.com
Prasthanam_ss@yahoo.co.in
www.prasthanam.com

కథ

# పునాది రాళ్ళ ప్రార్థన




## కర్లపాలెం హనుమంతరావు

✆ 9440361381


క్రీ.శ 3011 హాట్ జూపిటర్ నుండి అరగంట క్రిందట బైలుదేరిన సూపర్ సానిక్ రాంజెట్ "గో ఇండా" (గోవిందాకి గో ఇండియాకి సరిసమానమైన పదం) భూ కక్ష్యలోకి ప్రవేశించి అదే పనిగా గిరికీలు కొడుతోంది. చిన్న పిల్లలు ఆడుకునే టామ్‌వెరోప్లేన్ రిమోట్ కంట్రోలుతో తిరుగుతున్నట్లుంది ఆ దృశ్యం.

గోఇండా నుండి చూస్తుంటే భూమండలం మొత్తం ఒక మండే పెద్ద బంతిలాగా ఉంది.

స్పేస్ సెంటర్నుంచీ గ్రీన్ సిగ్నల్ రాగానే రాంజెట్‌లోని యువశాస్త్రవేత్త లిద్దరూ మాస్కులని మరోసారి సర్దుకొని, స్క్రామ్‌జెట్ సాయంతో సూటిగా భూమి వైపుకు దూసుకురావడం మొదలుపెట్టారు.

పొట్టిగా పాత సినిమాల్లో రామచంద్రరావులా ఉన్న వాడి పేరు మొగానో. పొడుగ్గా, రమణారెడ్డి లాగా పొట్లకాయ బొమ్మను గ్రాఫిక్సులా సాగతీసినట్లున్న వాడి పేరు తనాకో. వాళ్ళిద్దరు ఇంటర్ యూనివర్సల్ స్పేస్ యూనివర్శిటీలో రిసెర్చి స్టూడెంట్లు.

(స్కాంజెట్‌నీ, రాంజెట్‌నీ రిమోట్ ద్వారా కంట్రోల్ చేస్తూ హాట్ జూపిటర్ స్పేస్ సెంటర్‌లో కూర్చుని ఆపరేషన్ డిస్కవర్ ఇండియా సూపర్‌వైజ్ చేస్తున్నాయన పేరు కబిల్ అతను ఆ ప్రాజెక్టు గైడ్, ప్రకాష్ రాజ్‌లా ఉన్నాడు.

కబిల్ ముత్తాతలు కొన్ని వేల ఏళ్ళ క్రిందట భూమ్మీద జీవించినవారు. ఐదొందల ఏళ్ళ క్రిందట భూమ్మీద జనాభా పట్టనంతగా ఎక్కువైపోయి వనరులు హరించుకుపోయి జీవన మనుగడకే ముప్పు ముంచుకొచ్చిన వేళ గగనాంతర రోదసిలోని వేరే గ్రహాలకు వలసపోయింది మెజారిటీ మానవజాతి. కబిల్ ముత్తాతలు సూర్య కుటుంబంలోని గురు గ్రహానికి చేరినవారే.

ప్రకృతి వికృతిగా మారి, దారుణ దుష్పరిణామాల కారణంగా మిగిలిన జీవ జాతులన్నీ క్రమక్రమంగా నశిస్తూపోగా, ప్రస్తుతం భూమి ఒక మరుభూమిని తలపిస్తోంది. అడవులు అదృశ్యమయ్యాయి. నీరు పాతాళంలోకి ఇంకిపోయింది. ఆక్సిజన్ కరువై బొగ్గుపులుసు వాయువుతో పూర్తిగా నిండిపోయిన భూమి మీదకు మొగానో, తనాకో ఎందుకొస్తున్నట్లు?!

తమ సౌర వ్యవస్థను బోలిన మరెన్నో గ్రహ కుటుంబాలను వెదికి పట్టుకుని, పరిశోధించి థీసిస్ సబ్‌మిట్ చేయడం 'ఆపరేషన్ డిస్కవర్ ఇండియా 'లక్ష్యం. ప్రాజెక్టులో భాగంగా కబిల్ గైడెన్స్‌లో గగనాంతర రోదసీలో ప్రయాణిస్తూ ఇప్పటికే ఎన్నో పాలపుంతలను, నక్షత్రాలను, గ్రహాలను, పరిశీలిస్తూ, గెలాక్సీలను గాలిస్తూ చివరి అంచెగా భూగ్రహం మీదకి దిగుతున్నారు ఇప్పుడు ఆ యువశాస్త్ర వేత్తలిద్దరూ.

భూతలం మీది వాతావరణం మాత్రం భయానకంగా ఉంది. సెగలు కక్కే పెను తుఫాను గాలులు ఎడాపెడా గొడుతున్నాయి. కనుచూపు మేరంతా ఇసుక ఎడారుల్లాగా ఇసుకదిబ్బలే.

ఓజోన్‌పొర చిరిగిపోయి సూర్యకిరణాలు నేరుగా భూమిని తాకుతుండటం వల్ల జీవజాతులన్నీ ఏనాడో నశించాయి.

ఇంత జీర్ణావస్థలో ఉన్న భూమి మీదకు బాసు ఎందుకు దిగమంటున్నాడో యువకులిద్దరికీ అంతుపట్టడం లేదు.

స్కామ్ జెట్ నేలమీదకు లాండయిన తరువాత విద్యార్థులిద్దరికీ గైడ్ కబిల్ కమాండ్స్, స్పేస్ విండో నుండి వినబడుతున్నాయి. "కంగ్రాట్స్! వేలాది ఏళ్ళ క్రిందట రోదసీ మండలం మొత్తంలో మహా నాగరికతలు వెల్లివిరిసిన పుణ్యభూమి మీద మీరు ఇప్పుడు పాదం పెట్టారు." కబిల్ హృదయంలో మాతృ గ్రహం మీద భక్తి ఎంతలా పొంగి పొర్లుతోందో అతని గొంతులోని ఉద్వేగాన్ని బట్టే గమనించారు శిష్యులిద్దరూ. గురుదక్షిణగా ఇక్కడి నుంచీ ఏదైనా తీసుకెళ్ళి సమర్పిస్తే డాక్టరేట్ ఖాయమని ఇట్టే అర్థమయిపోయింది.

కబిల్ గొంతు గంభీరంగా వినపడుతోంది. "ఆ రోజుల్లో అమెరికా అగ్రరాజ్యంగా ఉండేది. అన్నింటిలో అదే ముందుండేది. వాళ్ళు గర్వంగా కట్టుకున్న స్టాట్యూ ఆఫ్ లిబర్టీని ఫోటో తియ్యండి"!

కెమెరాని బాస్ చెప్పిన డైరక్షన్ వైపు ఫోకస్ చేసి చూసాడు తనాకో. అక్కడమట్టి దిబ్బలు తప్ప ఏమీ కనిపించలేదు. "అల్ ఖైదా వాళ్ళు ఆ అమెరికా నెప్పుడో సర్వనాశనం చేసేసారు. దాని నామరూపాలు కూడా మీకు కనిపించవిప్పుడు అన్నారెవరో". ఆ గొంతు వినిపించినవైపు చూస్తే అక్కడెవరూ కనిపించలేదు! అదే విషయం తిరిగి బాస్‌కి చేరవేశాడు తనాకో.



'పోనీ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్ పేరుతో ఒక వెలుగు వెలిగి.. చివరికి రష్యాలాగా మిగిలిపోయిన దేశాల గుంపు వంక ఒకసారి మీ కెమెరా తిప్పండి! అట్టడుగు మనిషి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు నిర్మాణ రూపం రెడ్ స్క్వేర్. షూటిట్!" కబిల్ కమాండ్.

కెమెరా పొజిషన్ మారింది. సేమ్‌సీన్. మట్టి దిబ్బలే మట్టి దిబ్బలు. "వాళ్ళ ప్రభుత్వాలను వాళ్ళే కూల్చుకున్నారు. ముక్కలు చెక్కలయినా.. చివరికి ఒక చెక్కా మిగల్లేదు" అంది మళ్ళీ ఇందాకటి గొంతే. జీవి మాత్రం కనిపించలేదు!

శిష్యుల ద్వారా సమాచారం విన్న కబిల్ అన్నాడు "లండన్ టెన్ డౌన్‌లో ఉద్దండ పిండాలుండే వాళ్ళా రోజుల్లో. వాళ్ళ పాలనలో ప్రపంచం మొత్తంలో సూర్యుడు అస్తమించడానికే చోటుండేది కాదంటారు. ఆ సామ్రాజ్యపు మహారాజులు రాణులు నివాసమున్న ఆ వీధిని కెమెరాకి ఎక్కించండి!" తనాకో కెమెరా అటు తిరక్కముందే అందుకుంది ఇందాకటి గొంతే "నోయూజ్! ఆ సూర్యుడస్తమించని మహా సామ్రాజ్యం తరువాత్తరువాత అమెరికా వారి తోక దేశంలాగా తయారైంది. అల్‌ఖైదా దెబ్బకీ అదీ మాడి మసైపోయింది!"

ఓన్లీ వాయిస్... నో జీవి !

"బొట్టు పెట్టుకొనేటంత చిన్ని దేశమైనా అమెరికాని గడగడ లాడించిన జపాను దేశం నాగరికత మహా ఘనమైనది. నాటి మానవుడు సాంకేతికంగా ఎంత అభివృద్ధి పథాన్నందుకున్నాడో ఒక్క జపాన్ హిస్టరీ తెలుసుకుంటే చాలు. వాళ్ళ విసనకర్ర ఈక కనపడినా చాలు. ఒక ఫోటో పట్టుకోండి" అన్నాడు కబిల్ నిరాశను గొంతులో కనిపించనీయకుండా.

"అణు ధార్మికశక్తితో దానికదే మసయిపోయింది" అంది ఆకాశవాణి ఒక్క ముక్కలో.

"ఫ్యాషన్ ప్రపంచానికి నేర్పించిన ఫ్రాన్స్" కబిల్ గొంతు.

"ఎయిడ్స్ మహమ్మారి ఎప్పుడో ఆ శృంగార దేశాన్ని కబళించేసింది" అశరీరవాణి గొంతు.

"క్యూబా.." కబిల్ గొంతులో వణుకు

"ప్లేగు వ్యాధికి ఫినిష్" అ శరీరవాణి గొంతు.

"ఆఫ్ఘనిస్తాన్.. పాకిస్తాన్... ఉజ్‌బెకిస్తాన్.." కబిల్ పాఠంలా దేశాల పేర్లు వప్ప చెప్పేస్తున్నాడు.

"అవన్నీ తాలిబాన్లకి స్థావరాల్లాగా మారిపోయిన పిదప చరిత్రలో స్థానం లేకుండా పోయాయి. ఆఫ్రికన్ జంగిల్సుని కార్చిచ్చు, ఆస్ట్రేలియా ఖండాన్ని ఎల్లోఫీవరు.. ఒక్క ముక్కలో మీకు అర్థమయేట్లు చెప్పాలంటే తుఫానూ, భూకంపాలూ, సునామీలు, కరువులూ, వరదలూ, యుద్ధాలూ, రోగాలూ.. అన్నీ అన్నింటినీ నామ రూపాల్లేకుండా సర్వనాశనం చేసి పారేసాయి. అడుగూ బొడుగూ ఏమన్నా ఎంగిలివున్నా రాజకీయాలు వాటినీ కాజేసాయి. చివరికి ఇప్పుడు మిగిలింది... ఇదిగో మీరు చూస్తున్నారే ఈ మట్టి దిబ్బలే!" అశరీరవాణి ఆపకుండా చేసే ఆ అనవసర ప్రసంగానికి యువశాస్త్రవేత్త లిద్దరికీ తెగ వళ్ళు మండిపోయింది. గురువుగారికి దక్షిణంగా ఏదన్నా పట్టుకుని పోదామంటే.. వీడెవడు.. ప్రతిదానికీ పిలువా పెట్టకుండా కల్పించుకుని 'అంతా బూడిదయింది... మసయింది... నాశనమయింది.. మురిగిపోయింది... అంటూ అపశకునాలు తప్ప పలకడం లేదు. "రెండు వాయిద్దామంటే వాయిస్సే గాని మనిషి ఎదురుగా కనిపించడం లేదాయ ! తమకు డాక్టరేట్ రాకుండా తోటి విద్యార్థులు చేస్తున్న కుట్ర కాదుగదా ఇది ! కడుపులోని మంటను కడుపులోనే ఉంచుకొని ఏం ప్రయోజనం! కనపడ్డా.. కనపడకపోయినా ముందు కడిగిపారేయడం ఉత్తమం. తనాకో ఇంకా తమాయించుకోలేక పెద్ద గొంతుకతో అరిచాడు" ఇందాకట్నుంచీ చూస్తున్నాం ఏది చూద్దామన్నా లేదు పొమ్మంటున్నావు. ప్రకృతి బీభత్సానికి అంతా బూడిదయిపోతే మరి నువ్వెలా ఉన్నావు మహానుభావా!" "ఇంతకీ నువ్వెవరివి? మొనగాడివైతే మాముందుకురా!" అని వంతపాటందుకున్నాడు మొగానో.

బిగ్గరగా నవ్వు వినిపించింది. ఆ నవ్వుకు భూమి కంపించింది. "మీరు నిలబడ్డ చోటులోనే క్రింద వున్నాను. గొయ్యి తీసి చూడండి. నా దివ్య దర్శనం అవుతుంది. అందా గొంతు వింతగా మరోసారి విరగబడి నవ్వుతూ.

మొగానో గబ గబా గొయ్యి తీయడం మొదలుపెట్టాడు. రెండడుగులు కూడా తవ్వకుండానే బైట పడిందా గొంతు తాలూకు వింత ఆకారం. నిట్ట నిలువుగా ఉంది నల్లగా నిగ నిగ మెరిసిపోతుంది. వంటి మీదంతా ఏవో గాట్లు... పై నుంచి క్రింద దాకా..! ఇలాంటి ఆకారాన్ని ఆ గ్రహాంతర వాసులు ఇంత వరకూ రోదసీ మొత్తంలో ఎక్కడా చూసి ఉండలేదు. ప్రళయమొచ్చి భూమ్మీదున్న సర్వ జీవాలు దుంప నాశనమయినా.. చెక్కు చెదరకుండా.. నిట్ట నిలువుగా... తాజాగా.. కళకళ లాడుతూ



## సెప్టెంబరు నెల పురస్కారాలు

**లిక్కరు మంటలు..**

**కథకు........రూ.700/-**

**రచయిత : చక్రపాణి నోముల**

**నీడల ప్రవాహం**

**కవితకు.......రూ.500/-**

**రచయిత : వంగర పరమేశ్వరరావు**

**సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**

మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాదు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

- ఎడిటర్

---

కనిపిస్తున్న ఆ ఆకారాన్ని చూడగానే.. నిజం చెప్పద్దూ.. యువ శాస్త్రవేత్తలిద్దరికి ఒకింత గౌరవం కూడా కలిగింది. సాధ్యమైనంత వినయంగా తమ మనస్సులోని సందేహాన్ని బైటపెట్టారు కూడా.

"ఇంతకీ తమరెవరో సెలవిచ్చారు కాదు సార్!" అనడిగాడు తనాకో. ఆ ఆకారం చెప్పడం మొదలుపెట్టింది" పునాదిరాయి అంటారు నన్ను. వెయ్యేళ్ళ క్రిందట ఇక్కడ ప్రజాస్వామ్యమనే పరిపాలనా విధానం ఒకటి వర్థిల్లింది. ప్రజాస్వామ్య మంటే ప్రజలే రాజులు. ప్రజల కొరకు, ప్రజల వలన, ప్రజల చేత నడిచేపాలన. మరీ లోతుగా వెళ్ళద్దులే. మీరొచ్చిన పనికూడా మర్చిపోయి తిరిగివెళ్ళటానికి తిప్పలు పడతారు. అంత తికమకగా ఉంటుందా ఆ రాజకీయ వ్యవహారం. ప్రజాస్వామ్య మంటే ప్రజలూ.. వారెన్నుకునే నాయకులు.. వాళ్ళు పాలించే ప్రజలు.. ఈ మాత్రం అర్థం చేసుకోండి చాలు ప్రస్తుతానికి ఇంకనేనెవరో చెబుతాను. వినండి! ఎన్నికల్లో నిలబడి గెలవడానికి నాయకులు కావాలనుకునేవాళ్ళు ఎన్నికల ముందు కొన్ని వాగ్దానాలు చేస్తారు. ప్రాజెక్టు కట్టిస్తామని, బళ్ళు పెట్టిస్తామని, ఫ్యాక్టరీలు నిర్మిస్తామని.. ఇట్లా ! వాళ్ళు వాగ్దానం చేసినంత మాత్రాన జనం నమ్మాలని ఏముంది? వాళ్ళకి నమ్మకం కలిగించడానికి నాయకులు ఇదిగో ... ఇవాళే ... ఇక్కడ ... మీకు భవిష్యత్తులో కట్టబోయే భారీ నిర్మాణానికి నాంది పునాదిలో రాయివేస్తున్నాం. అంటూ బ్రహ్మాండంగా ఊరేగింపూ గట్రా జరిపి పటా టోపంగా మమ్మల్ని పాతేస్తారన్నమాట. మమ్మల్ని చూసి నమ్మిన జనం వాళ్ళకు ఎన్నికల్లో ఓటేస్తే గెలిచి నాయకులు అయిపోయి... వాళ్ళు చేయాలనుకున్న పనులన్నీ మళ్ళీ ఎన్నికలొచ్చేలోగా సుబ్బరంగా చేసుకుంటారన్నమాట" "ఒక్క నిమిషం పునాది రాయీ! చిన్న సందేహం. మరి వాగ్దానం చేసినట్లు నాయకులు నిర్మాణాలు ఎన్నికలయిన తరువాత పూర్తి చేస్తారు గదా! అయినా మీరింకా ఇలాగే పునాదులో శిలా విగ్రహాల్లో అల్లాడుతున్నారే !

పకా పకా నవ్వింది పునాది రాయి "మరదే ప్రజా స్వామ్యమంటే. సరే ఇందాకట్నుంచీ ఏది కనిపించటం లేదని అల్లాడుతున్నారు కదా ! అమెరికా, రష్యా, చైనా జపానంటూ ఎన్నడో అంతరించి పోయినవాటిని గురించి వెదుక్కుంటున్నారు కదా ! వృథాగా వాటికోసం సమయం పాడు చేసుకోకుండా... నన్నూ, నా సోదరులనూ.. ఫొటో తీసిపట్టుకుపోండి ! అంత దూరం నుండి వచ్చినందుకు ఈ మాత్రమన్న దక్కినందుకు సంతోషించండి."

"నువ్వేకాక నీకు సోదరులు ఇంకా ఉన్నారా ! సజీవంగా నీలాగే ఉన్నారా? అనడిగాడు తనాకోనోరెళ్ళ బెట్టి

"ఎందుకు లేరు! వందలొందలు. మీ కెమేరాలు ఆన్‌చేయండి... వరసగా పరిచయం చేస్తాను. ఫ్లాష్ చేసుకోండి! అదిగో అది బ్రహ్మాణి సిమెంటు ఫ్యాక్టరీ తాలూకు పునాదిరాయి. ఇదిగో ఇది పోలవరం అనే నీటి ప్రాజెక్టు ప్రారంభోత్సవానికి వేసిన పునాది రాయి. అల్లదిగో ఆ మూల వున్నది. హంద్రీ నీవా సుజల స్రవంతి పునాది రాయి. ఇల్లదిగో ఈ మూల వున్నది. అప్పట్లో హైదరాబాదనే ఆంధ్రప్రదేశ్ రాజధాని ట్రాఫిక్ సమస్యకు పరిష్కారంగా ప్రారంభించిన మెట్రో రైలు ప్రాజెక్టు పునాది రాయి. ఇది సిద్దిపేట స్పోర్ట్స్ స్టేడియం పునాది రాయి. ఇది పటాన్ చెరువులో వెయ్యి పడక లాసుపత్రి అప్పటి ముఖ్యమంత్రి వేసిన పునాదిరాయి. ఇది బడాయి గడ్డలోకాజ్ వంతెన తాలూకు పునాది రాయి. ఇదిగో పుణ్యవరంలో బ్రిడ్జి నిర్మాణానికి వేసిన రాయి. ఇలా మీరు ఎక్కడ తవ్వి తీసినా చక్కని పునాది రాళ్ళు అనాదిగా అనాథల్లా పడివుండి కనిపిస్తాయి. ఎన్ని ప్రభుత్వాలు మారినా ప్రగతి లేదు. మాగతి మారలేదు. మా ఫొటోలను తీసి మీరు ప్రాజెక్టు పూర్తి చేస్తే మీరు కోరుకున్న పట్టా గ్యారంటీ!"

కెమేరాలో తళతళ లాడుతున్న ఆ పునాదిరాళ్ళన్నింటినీ గబగబా ఫొటోలు తీసుకుని ఆనందంగా మళ్ళీ అంతరిక్షంలోకి ఎగిరే ముందు మొగానో! తనాకో కృతజ్ఞతా పూర్వకంగా అన్నారు. "మీ రుణం ఎన్ని జన్మలెత్తినా తీర్చుకోలేం". తీర్చుకోవచ్చు ఈ జన్మలోనే. మమ్మల్ని లా నిలువునా పాతేసి వెళ్ళిపోయిన పెద్ద మనుషులు మీరు వెళ్ళే దారిలో ఏ నరకంలోనో, పాతాళ లోకంలోనో కనిపిస్తారు. పెద్ద మనసు చేసుకొని వచ్చి కనీసం ఒక్క ప్రాజెక్టునైనా ప్రారంభించి మాకు ముక్తి కలిగించమని మా తరుపున విన్నవించండి" అంది ఆ పునాదిరాళ్ళ సంఘం ప్రధాన కార్యదర్శి. ♦

## తక్షణ కర్తవ్యం

ఇల్ల ప్రసన్న లక్ష్మి



ప్రభాత కిరణాల పరిష్వంగపు వెలుగులు...
ఉషోదయాన వాకిటదోసిట పూలై పూస్తుంటె
ఉల్లాసం ఊపిరై హృదయతంత్రుల్ని మీటుతుంటె...
వేకువ సింధూరం... రక్తాశ్రువులుగా మారి
పత్రికా పఠనంలో... బుల్లితెర వీక్షణలో విచక్షణ మరచి
నరాల్ని మెలిపెడుతూ ఉదయ సంధ్యా రాగ మాలపిస్తోంది !
రంగుల ప్రపంచం ఆడంబరాల ఎండమావుల వైపెగదోస్తుంటె...
రాదారి రక్కసి రక్తపు మడుగుల్ని సృష్టిస్తోంది
తప్పు తనదో... వేరొకరిదో
క్షణకాలపు నిర్లక్ష్యం...
క్షమించనంటూ కాలం కాళుడై
వయస్సు... వార్ధక్యమన్న బేధం మరచి
నిర్దాక్షిణ్యంగా నలిపేస్తుందాక్షణం
ఆప్తుల ఆఖరి చూపులు నోచుకోకుండానే
ఆయువు అనంత వాయువుల్లో కలసిపోవడమెంత దారుణం
భయాన్ని బింకంగా మార్చి నిర్భయంగా
బయటడుగేస్తున్న ప్రతిక్షణం... బతుకెంత దుర్భరం
వెళ్ళేదెందరో... వచ్చేదెందరో
లెక్కతేల్చలేకపోతున్న గణిత పరిజ్ఞానం
విజ్ఞాన విహంగాలై వినువీధికెగసే జనం
తప్పు - ఒప్పుల్ని తర్కించకుండానే
తక్షణ కర్తవ్యాన్ని తలపోయక
తలరాత అని మనల్ని మనమే ఏమార్చుకోవడమేనా మన ఖర్మం !

---

## ఇదీ సంగతి

జ్యోతిర్మయి మళ్ళ



దొరగారు...
తాగితాగీ తాగలేక వదిలేసి వంపేసిన
తినితినీ తినలేక కక్కేసి జల్లేసిన
ఒకరోజు తిండి విలువ ఎంతో తెలుసా !
తాగ గంజినీళ్ళు లేక పేగులంటుకుపోయిన
వెయ్యిమంది అన్నార్తుల
డొక్కలు తడపగలిగినంత !

**దొరమ్మగారు...**
ఒకట్రెండు రోజులకే మొహం మొత్తేసిన
చూడకుండా వాడకుండా వదిలేసిన
సౌందర్య సాధనాల ఖరీదెంతో తెలుసా !
పగలూ రాత్రీ ఇంటాబయటా చాకిరీ చేసినా
తన బిడ్డలకు పట్టెడన్నం పెట్టుకోలేని
వందమంది నిరుపేద మాతృమూర్తుల
శోకాన్ని చల్లార్చగలిగినంత !

చిన్న దొరగారు...
వినకపోయినా మోగే స్టీరియో
చూడకపోయినా వాగే వీడియో
కరెంటు నెలకయ్యే ఖర్చెంతో తెలుసా !
కడిగే కాఫీకప్పుల కుళ్ళు నీళ్ళలో కొట్టుకుపోయే
తుడిచే బూట్ల దుమ్ముధూళిలో ఎగిరిపోయే
పదిమంది బాలమేధస్సుల
ఆశను తీర్చగలిగినంత !

# ఇంద్రగంటి వారి ప్రతిమ - ప్రతిభ

ప్రసాదవర్మ కామఋషి



పిఠాపురంలో జరిగిన సాహిత్య సభల సందర్భంలో తీసిన ఫొటో. మధ్య వరుసలో మధ్యన కూర్చున్న వారు ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి.

**1951లో ప్రకటించిన గ్రంథం "ప్రతిమ" నాటకం. ఇది భాసుని సంస్కృత నాటకానికి ఆంధ్ర కృతి. అలతి అలతి పదాలతో, ఇక్షురస సదృశ శిష్టవ్యవహారికం లో లలిత సుందరంగా సాగిన రచన. ఏడంకాల ఈ నాటకం చదివి ఆనందపరవశు లవటమేగాని, ఇది గ్రాంథికమా వ్యవహారికమా అన్న ఆలోచనే రాదు పాఠకునికి. ఆరుయుగాల ఆంధ్ర కవితలో ఒకచోట' సూత్రప్రాయంగా ఉన్న సంస్కృత వాక్కును తెనుగు ఊపిరితో తెనిగించాలి' అంటారు. అలా తెనుగు ఊపిరులద్ది తెనిగించిన నాటకం ప్రతిమ.**

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి పేరు చెప్పగానే గుర్తుకు వచ్చేది సృష్టిలో తీయనిది స్నేహమేనోయి అన్న వారి పాట. వీరు సంప్రదాయ రీతిలో సంస్కృతాంధ్ర భాషలు అభ్యసించి ఉభయ భాషా ప్రవీణులుగా ప్రసిద్ధి గాంచేరు. నిరంతరం మారే అభిరుచులపట్ల, నవ్యత పట్ల ఎన్నడూ చిన్నచూపు చూడని అభ్యుదయ వాది, ప్రగతి శీలి. నవ్యులలో నవ్యుడుగా ప్రాచీనులలో ప్రాచీనుడుగా మెలిగిన నిష్కళంక సాహితీవేత్త. ఆనాటి సమస్త సాహిత్యోద్యమాలతోను, తత్కర్తలతోను, సాహిత్యాభిలాషులందరితోను సన్నిహితంగా మెలగినవారు. అభ్యుదయ రచయితల సంఘం నవ్య సాహిత్య పరిషత్ వంటి సాహిత్య సంస్థలలో తోడు నీడై మెలగిన వారు. అయినప్పటికీ వివాద రహితుడుగా పేరుగాంచిన అజాత శత్రువు. తన రచనల ద్వారా ఉపన్యాసాల ద్వారా నవ్యసాహిత్య వ్యాప్తికి పాటుపడ్డారు. 1929లో ఒక పద్యఖండికతో వీరి సాహిత్య ప్రస్థానం ప్రారంభమైనదని చెపుతారు. చివరి రచన 'ఆరు యుగాల ఆంధ్ర కవిత' అది ప్రాచీనాంధ్ర కవితా రీతులను కావ్య చరిత్రను కళాత్మకంగా ఆవిష్కరించిన గ్రంథం. "కంటబడ్డ ప్రతి కవి వెంటపడకుండా ఆ యుగంలో కణ కణ వెలిగే వ్యక్తిత్వం గల కవుల గురించి శాసనాలతో, వీరాసనాలతో పోషక రాజవంశ వృక్షాలతో, కాలనిర్ణయ కల్లోలాలతో తలనొప్పి పుట్టించకుండా" సాహిత్య సౌందర్య సమీక్షగా సాగిన రచన యిది. వీరు మంచి కథకులు. 1935-45 మధ్యకాలంలో చాలా కథలు, పాటలు, రేడియో నాటకాలు రాశారు. ఇది వీరి సాహిత్య వ్యాసంగంలో మొదటి దశ అని, 1949-87 మధ్య కాలం రెండవ దశగాను ఇంద్రగంటి శ్రీకాంత శర్మగారు పేర్కొంటారు. ఈ ప్రౌఢ నిర్భర వయః పరిపాక దశలోనే దక్షారామం పద్యకృతి, కీర్తితోరణం అన్న కావ్యం, కాళిదాసు, నన్నయ మీద విమర్శా గ్రంథాలు, అనేక పద్య ఖండికలు వెలువరించారు. ఈ రెండవ దశాకాలంలో, అంటే 1951లో ప్రకటించిన గ్రంథం "ప్రతిమ" నాటకం. ఇది భాసుని సంస్కృత నాటకానికి ఆంధ్ర కృతి. అలతి అలతి పదాలతో, ఇక్షురస సదృశ శిష్టవ్యవహారికం లో లలిత సుందరంగా సాగిన రచన. ఏడంకాల ఈ నాటకం చదివి ఆనందపరవశు లవటమేగాని, ఇది గ్రాంథికమా వ్యవహారికమా అన్న ఆలోచనే రాదు పాఠకునికి. ఆరుయుగాల ఆంధ్ర కవితలో ఒకచోట' సూత్రప్రాయంగా ఉన్న సంస్కృత వాక్కును తెనుగు ఊపిరితో తెనిగించాలి' అంటారు. అలా తెనుగు ఊపిరులద్ది తెనిగించిన నాటకం ప్రతిమ.

ఇదివరకే పెద్దలీ నాటకమును అనువదించినప్పటికీ "భాస హృదయమునింకనూ తెలుగులకు సన్నిహితము చేసి, అతని నాటకీయ ప్రకర్షనందురు స్ఫుటముగ దర్శించి కృతార్థులు కావలెనని దీనివలన మరికొంత భాస నాటక మాధుర్యము తెలుగు రసజ్ఞులా స్వాదింప గల్గుదురని" ఈ అనువాద ప్రయత్నం చేసినట్లు చెప్పుకున్నారు. "భాస కవి ఎంతటి పురాణ కథనైననూ జిదుక గొట్టి తన ప్రజ్ఞయను మూసలో కరగించి క్రొత్త అచ్చులో పోసి విచిత్ర రూపములు కల్పించును" అన్నది భాసునిపై శాస్త్రి పరిశీలనాత్మక తీర్పు!

నాటక కథా సంగ్రహం : భరతుడు మేనమామ ఇంట నుండి తిరిగి వస్తున్నప్పుడు, అనుకోకుండా ప్రతిమా గృహం సందర్శించటం అక్కడ తన పూర్వీకుల విగ్రహాలతో పాటు తండ్రి దశరథుని విగ్రహం కూడా ఉండటం తండ్రి మరణవార్త తెలుసుకోవటం, ఆ దుఃఖ తీవ్రతలో అటునుంచి అటే అరణ్యానికి బయలుదేరి, రామపాదుకలు పరిగ్రహిస్తాడు. రావణ వధానంతరం శ్రీరాముడు దండకారణ్యంలో జనస్థానానికి వచ్చి మునిజనాశీస్సులు పొంది, వారి కోరికపై అక్కడే పట్టాభిషేకం జరగటంతో నాటకం ముగుస్తుంది.

ఈ నాటకాన్ని శాస్త్రి గారు ఇష్టదైవానికో, ఒక ఆత్మీయునికో, సన్నిహితునికో, సాహిత్య పిపాసువుకో, దాతకో కాక ఒక గ్రంథాలయానికి అంకితమివ్వటం విశేషం. దానికొక విచిత్రమైన నేపథ్యం ఉంది అదేమిటంటే :

ఊరు చిన్నదైనా కళాసాహిత్య రంగాలలో పిఠాపురానికొక ప్రత్యేకత ఉన్నది. ముఖ్యంగా కవి పండితులనేకమంది అక్కడ ఉండేవారు. పిఠాపురం రాజవంశీకులందరూ కవి పండితులను ప్రోత్సహించి పోషించినవారే. పిఠాపురం రాజా వారికి గొప్ప గ్రంథాలయం ఉండేది. కాని అది అందరికీ అందుబాటులో ఉండేది కాదు. కొందరు యువకులు 1915 లో విద్యానంద పుస్తక భాండాగారం అని ఒక లైబ్రరీ ప్రారంభించారు. మరుసటి సంవత్సరం 1916లో శ్రీసూర్యరాయ పుస్తక భాండాగారం పేరుతో మరొక గ్రంథాలయం వెలిసింది. ఈ రెండు గ్రంథాలయాల కార్యకర్తలు పోటీ పడి పుస్తక సేకరణ వివిధ పత్రికలు తెప్పించటం చేసేవారు. అప్పుడప్పుడు నాటక ప్రదర్శనలు, పురాణ ప్రవచనాలు ఏర్పాటు చేసేవారు. కొంత కాలానికి ఒకే ఆదర్శంతో ఒకే ఆశయంతో పనిచేస్తున్న ఈ రెండు సంస్థలు కలిస్తే మరింత సమర్థవంతంగా పనిచేయవచ్చునని తీర్మానించారు. ఫలితంగా 1922లో శ్రీ సూర్యరాయ విద్యానంద గ్రంథాలయం వెలసి నేటివరకు చక్కగా పనిచేస్తోంది.

***

**పిఠాపురం రాజా వారికి గొప్ప గ్రంథాలయం ఉండేది. కాని అది అందరికీ అందుబాటులో ఉండేది కాదు. కొందరు యువకులు 1915 లో విద్యానంద పుస్తక భాండాగారం అని ఒక లైబ్రరీ ప్రారంభించారు. మరుసటి సంవత్సరం 1916లో శ్రీసూర్యరాయ పుస్తక భాండాగారం పేరుతో మరొక గ్రంథాలయం వెలిసింది. ఈ రెండు గ్రంథాలయాల కార్యకర్తలు పోటీ పడి పుస్తక సేకరణ వివిధ పత్రికలు తెప్పించటం చేసేవారు.**

***

ఆ నాటి సాహిత్యాభిమానులందరూ అక్కడే కలుసుకొనే వారు. ఉంటే ఇంట్లోను లేకపోతే లైబ్రేరీ లోను దొరికేవాళ్ళు. కృష్ణశాస్త్రి గారి మకాం కొంతకాలం లైబ్రరీలోనేట! ఈ గ్రంథాలయం చాలాకాలం సోములుబాబు గారని పిలవబడే దావెర సీతారామస్వామి గారి మేడమీద ఉండేది. వీరు పిఠాపురం రాజా వారికి బావ మరిది. ప్రారంభ దినాల మొదలు చాలా యేళ్ళు కార్యదర్శిగా పనిచేసిన వారు వెలమకన్ని సుబ్బరాయ శాస్త్రి గారు. తరువాత మైలవరపు కృష్ణమూర్తి, కామఋషి సత్యనారాయణవర్మ, కొత్త సూర్యనారాయణ కార్యదర్శులుగా విశేష సేవలందించి గ్రంథాలయాభివృద్ధికి ఎంతగానో తోడ్పడ్డారు. లైబ్రరీకి వీరి సేవలు మరువరాని వని నేటికీ చెపుతారు. అధ్యక్షులుగా సోములుబాబు, ఉపాధ్యక్షులుగా స్వాతంత్ర్య సమరయోధులు డా. తనికెళ్ళ సత్యనారాయణ ఉండేవారు. కొంతకాలానికి దీనికి సొంత భవనం ఏర్పాటయ్యింది. అప్పటి నుంచి దసరా నవరాత్రులలో సాహిత్య సభలు పెద్ద ఎత్తున జరపటం ఆనవాయితీ అయింది. అనేకమంది పండితులు, కవులు, భాషావేత్తలు వివిధ విషయాలపై ఉపన్యాసాలు, చర్చలు, కావ్యగోష్ఠులు జరిపేవారు. కందుకూరి వీరేశలింగం, కొచ్చర్లకోట వేంకటకృష్ణారావు, పింగళిలక్ష్మీకాంతం, విశ్వనాథ సత్యనారాయణ, మునిమాణిక్యం, మొక్కపాటి, దేవులపల్లి కృష్ణశాస్త్రి వంటి ఉద్దండులు, ఇక్కడ ప్రసంగించిన వారే. ఈ పది రోజుల మహా సభలు జయప్రదంగా జరగటానికి ఇతర గ్రామాల నుంచి కూడా ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి మధునా పంతుల సత్యనారాయణ వంటి సాహిత్యాభిలాషులు వచ్చి సహాయ సహకారాలందించే వారు. ఇప్పటిలాగ ఉదయం రైల్లో దిగి రాత్రి రైలుకి పరుగెట్టుకెళ్ళి పోవలసిన తొందరలు, వేగాలు అప్పుడుండేవి కావు గదా. సభలకు ముందు నాలుగు రోజులు అయ్యాకో రెండు మూడు రోజులు ఉండి సరదాగా పలకరింపులు, కొండొకచొ వెక్కిరింతలు, వాదోపవాదాలు, కవిత్వతత్త్వ విచారాలతో నవ్వులు పువ్వులై వెల్లివిరిసే సాహితి సమిష్టి కుటుంబ వాతావరణం ఉండేది.

అదిగో అలాంటి సందర్భంలో 'వికృతి వత్సరాశ్వయుజమున' ఒకనాటి సభలో ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారు భాసుని నాటకీయ ప్రతిభ గురించి రెండు గంటలు ప్రసంగించారు. వారి ప్రసంగము ముగిసిన వెంటనే గ్రంథాలయోపాధ్యక్షులు, దేశభక్తులు నగు డా. తనికెళ్ళ సత్యన్నారాయణ లేచి "అట్టి ప్రతిమను మీరు తెనిగించినచో సంతోషంతో మా గ్రంథాలయము ప్రకటించును" అని అన్నారట. ఆ పిమ్మట మిత్ర బృందము ప్రతిమా నాటకము ననువదించు వరకు నన్ను నిద్రపోనీయలేదు. కామ ఋషి సత్యనారాయణ వర్మ, మైలవరపు కృష్ణమూర్తి, కురుమెళ్ళ వెంకటరావుల ప్రశంశ ప్రోత్సాహములే ఈ రచన ఆద్యంతము కొనసాగుటకు కారణమని చెప్పుకున్నారు. ఆ మరుసటి సంవత్సరం గ్రంథాలయ శారదోత్సవములలో ఆంధ్రీకృత ప్రతిమ ఆవిష్కరణ జరిగింది.

"శుభ్ర శారదా సమయ పూజా శుభ మహోత్సవ వేళ బండిత
సుకవి సమలంకృత సభన్ గౌతుకము దీపింపన్
అలరు సూర్యరాయ విద్యా
నంద గ్రంథాలయ సు పూజిత
విమల వాణీ పీఠమున నీ
సుమము నర్పింతున్"

అంటూ ఆ కృతిని గ్రంథాలయానికే అంకితమిచ్చారు. ఇలా ఒకగ్రంథాన్ని ఒక సంస్థకు అంకితమివ్వటం అరుదైన సన్నివేశం.

అయిదు దశాబ్దాలపాటు సాహిత్యోపాసన చేసిన వాఙ్మయ ఋషి చంద్రునికీ అక్షరాంజలి.

***(నవంబర్ 14 ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి వర్ధంతి)***

రచయిత సెల్ : **9441274034**

# సంస్పందనలు ఓల్గా కవితలు



**ఎం. నారాయణ శర్మ**

నిబద్ధ కవిత్వాన్ని చదువుతున్నప్పుడు కొన్ని అంశాలను గమనించవచ్చు. ప్రధానంగా నిబద్ధత అనేది వస్తువు. సిద్ధాంతం అనే రెండు నిర్మాణాంశాల్లోని మధ్యగల స్థిరాంశం. పై రెండు అంశాలకు మధ్య స్థిరమైన దార్శనిక పరిధిని ఒకదాన్ని నిబద్ధత ప్రేరేపిస్తుంది. నిబద్ధ కవిత్వాన్ని చదువుతున్నప్పుడు కొన్ని సందేహాలు కలుగుతాయి. సాధారణంగా నిబద్ధాంశాలలో సమూహ చైతన్యం ఉంటుంది. అది వైయక్తిక ప్రతిభ వలన ఉదాత్త నిమ్న ప్రతిఫలనాలను చూస్తుంది. ఇదే సాహిత్యాన్ని నిలబెడుతుంది.

నిబద్ధతలను దర్శించడానికి ప్రేరణ ఏదిస్తుంది? అనే ప్రశ్న వేసుకున్నప్పుడు కొన్ని అంశాలను చూడవచ్చు. కవితా నిర్మాణంలో కళాకారుడు ఒక ప్రక్కగా నిలబడి సందర్భాన్ని అందులోని వాతావరణాన్ని సాధిస్తాడు. సందర్భంలో నిష్పన్నమైనా కాకపోయినా ప్రతి సందర్భంలో రెండు పాత్రలుంటాయి. రెండు అస్తిత్వాలుంటాయి. ఈ రెంటి అనుభవంలో రస నిష్పత్తి సమాంతరంగా ఉండదు. మూర్తా మూర్తాలలో నిబద్ధ సాహిత్యంలోని రెండు వస్తువులు సమానగుణం కలిగినవే అయిఉంటాయి. కాని వాతావరణంలో వీటికి గల అనుభవిక నిష్పత్తులు వేరు. ఒకటి అనుభూత ద్రవ్యంగా ఉంటే మరొకటి అనుభోక్తంగా ఉంటుంది. అందువల్ల సమాంతరత చెడిపోతుంది. ఈ సందర్భంలో అనుభూత ద్రవ్యంగా ఉన్నది ఆత్మ చైతన్యానికి లోనైతే నిబద్ధత కనిపిస్తుంది.

నిజానికి నిబద్ధ సాహిత్యం కేవలం సిద్ధాంత, వస్తుగతమైన అంశాలతో కూడిందే అయితే పాఠకుడు ఏ కవిత్వం చదివినా ఆపరిధిలో వెళ్లిపోవాలి. అందువల్ల నిబద్ధ రచనలోనూ సృజనకారుని ప్రతిభని ప్రత్యేకంగా గుర్తించాలి. వస్తువుకు సమాజగతంగా వర్ణన పార్శ్వానికి ఉన్న ప్రాతినిధ్యం వలన నిబద్ధ సాహిత్యంలో సృజనాత్మక, ప్రతిభను లెక్కలోకి తీసుకోవటం జరగదు. కాని పాఠకుడికి విషయాన్ని చేర్చే వ్యక్తీకరణలో రచయితలోని నిబద్ధుడికన్న సృజనకారుని ఫలితమే ఎక్కువ.

ఆధునిక తెలుగు కవిత్వంలో నిబద్ధ సైద్ధాంతిక రూపాలు ఎక్కువగానే కనిపిస్తాయి. ఈ కోవలో ఓల్గా లాంటి సృజనకారుల దార్శనిక స్వభావాన్ని గూర్చి స్పష్టత లిప్పటికే సాహితీ లోకంలో ఉన్నాయి. నిబద్ధత దర్శన గుణాన్నే కాని వ్యక్త రూపాన్ని నిర్దేశించదు. ఓల్గా 'కవితలు కొన్ని" పేరుతో వచ్చిన సంపుటిలో సుమారు యాభైకి పైగా కవితలున్నాయి. ఈ కవితల్లో సుస్పష్టంగా ఓ సమూహాత్మ ఉంది. ప్రధానంగా నిబద్ధ వచనంలో సమూహాత్మ, స్థల కాలాల నేపథ్యంలో లేకపోవటం ఆత్మగౌరవంగా కనిపించే సమానాశంస ఉంటాయి.

సుమారు 1972 కాలాన్నుండి కన్పించే ఈ కవితల్లో ఆమె లోని నిబద్ధ సృజనలు పోటీపడతాయి. ప్రాతిపదికంగా కనిపించే నినాదం కన్నా విధానమే ఇందులో ఎక్కువ. ఇందులో అనువాద స్వీయ కవితలున్నాయి. స్వీయోద్దీపన. స్థితిగతాశంస. అతి సున్నితమైన తిరస్కారం ఇందులో కనిపిస్తాయి.

స్వర పునరుక్తి, గొలుసుకట్టు వాక్యాలు, సంభాషణలని భావ చిత్రాలుగా చిత్రంచడం ఇలాంటి వాటి ద్వారా ఉద్వేగాన్ని పెంచడం. గుప్త భాగాన్ని ప్రతీకాత్మక చైతన్యంతో చెప్పడంలాంటి నిర్మాణాంశాలున్నాయి.

జీవితం ఓ సార్థకత కలిగిందని దానికి కొన్ని కలలున్నాయని ఆ కలల సాఫల్యమే జీవన పరిపూర్ణత్వమని ఓల్గా కవిత్వం నమ్ముతుంది.

అననుభూత జీవన పూర్ణత్వా పేక్షగాల వచనమిది. ఈ కవిత్వంలో ఈ ఆశల ప్రతీకాత్మకత ఎక్కువగా కనిపిస్తుంది. జీవన ఫలం కలలు సాకారమవటం. ఆ కలలకు ఆకరం నిద్ర. దానికి ఆధారం లేదా సందర్భం రాత్రి. బహుశః అందువల్లే ఈ కవిత్వంలో 'రాత్రి' అనే పదం అనేక నిబద్ధోద్వేగాలకు ప్రతిరూపంగా కనిపిస్తుంది. సుమారు పన్నెండు వరకు రాత్రి అనేపదం పరిధిలో కవితలున్నాయి.



"రాత్రంటే నీకు నిద్రావస్థ

నాకు భగ్న స్వప్నం" --- (70పే)

"నా రాత్రులను వేధించి వెంటాడే ప్రశ్న / రాజకీయంలో ప్రతీరాత్రీ హోరాకిరి తప్పదు" --- (పే 43. రాజకీయ రాత్రులు)

"మగత నిదురల --- చిరుదరహాసంలో / ప్రతీరాత్రీ)

ఓ స్వప్న గుచ్ఛం" --- ((పే 77 చిన్ననాటి రాత్రులు)

"ఈ రాత్రి తెల్లవారకూడదు / ఎన్నటికీ ఓటమి భయం / పట్టపగలులా నను తాకకూడదు" (పే. 80. విజయోత్సవ రాత్రి)

ఈ పరిధిలో ఆలోచిస్తే ఊహా జీవితం లేదా ఆశాజీవితం వాస్తవ జీవితానికి మధ్య బాహ్యాంతశ్చేతనల సారంగా తేడాని ఈ కవిత్వం గమనించింది. అందువల్ల రాత్రి కలలకు ఆకరమైన 'ఆశా' ప్రతికగా వెలుగు లేదా అనిద్రావస్థ, ఉదయం ఇవన్నీ జీవితపు అసంపూర్ణత్వాన్ని ప్రతిపాదించేలా కనిపిస్తాయి. ఒక స్వప్నంలోని వైయక్తిక భావనని సమూహం లేదా సంగమంలో అనుభవించలేకపోవడమనే వెలితి ఈ కవితల్లో ఉంది. తన ఉనికిని తాను కోల్పోవడం, మార్చుకోవడం జీవితంలో కేవలం పార్శ్వంగా, అనుకలనాంశంగా ఉండే స్థాయి నుండి తనను తాను వ్యక్తపరచుకోవడం కనిపిస్తుంది.

సంప్రదాయిక, ఆధునిక జీవితాల్లోని భాగ స్వామ్య సంబంధాల్లో గల అజమాయిషీనీ 'అనుభూత' భాగం నుండి ఆవిష్కరించిన కవిత "హింస" ఈ చిత్రణలో ఓల్గా లోని భావ చిత్రాలను గమనిస్తే ఆమె కవితాధార బాగా అమవుతుంది.

"నీ శరీరమంతా సెక్సువాసన / పవిత్రంగా లేదు, భారతీయంగా లేదు / కప్పుకో కప్పుకో కాషాయం"

"నగ్న పోస్టరువై / గోడల మీద కెగబడ్డం / నీ అందం కోసం ఇవిగో నా సరుకులు / మార్కెట్ వెంబడి పరుగెడు అని తొందర పెడతాడు"

"వాళ్లిద్దరి మాటలూ / నాకొకలాగే వినిపిస్తాయి" (హింస)

అందమైన భావ చిత్రాలు గీయడంలో ఈ కవిత్వంలోని సృజనశీలత సౌందర్యాత్మకమైంది. పఠిత హృదయాలకు స్వీయ ఉద్దేశాన్ని మాత్రమే కాకుండా ఉద్వేగాన్ని, ఉధృతుని అందించడంలో ఈ వర్ణనాత్మకత (Discription) గొప్పగా కనిపిస్తుంది.

"ముఖమంతా చల్లగా నిమిరి

గుసగుసలాడే చినుకు నేస్తాలు"

(77 పేజి చిన్ననాటి రాత్రులు)

"భూమి చీల్చుకొచ్చిన బీజాన్ని / తొలి

పువ్వై తొడిగిన కొమ్మను"

(పేజి 80. విజయోత్సవ రాత్రి)

"పురాతన లోహదుర్గాన్ని పిండి చేసి / దూరాలను చెరిపేసే దారులు వేస్తున్నాను" - (84 పే. అస్తిత్వరాత్రి)

ఈ కవిత్వంలో నిబద్ధపార్శ్వం వర్గ శత్రువు ప్రతిగా నిలబడే నినాదం లాంటిది కాదు. జీవితంలో ఓ ప్రధానాస్తిత్వాన్ని వ్యక్తం చేసేది. బాధ్యతల నుంచి తప్పించుకుని ఉరివేసుకుని వెళ్లిపోయిన భర్త భారాన్ని మోయడానికి నిర్ణయించుకున్న భార్య గొంతులో "చావుని కాదు బతుకుని" కవితలో ఈ అసహనం వీరత్వం ప్రశ్న ముఖంగా కనిపిస్తాయి.

"నీ పంట నాశనాన్నే చూసావు గానీ / నా కడుపు పంటి సంగతి ఏమాలోచించావు / పురుగు కొరుక్కుతిన్న పత్తికాయల్లా వాళ్ల నెలా గాలి కొదిలెయ్యమంటావు"

- (పే.59. చావుని కాదు బతుకుని)

ముద్ద కోసం గాదు యుద్ధం కోసం బతకాలని నేర్పుతానని తన ధీరత్వాన్ని ప్రదర్శిస్తుంది. ప్రధానంగా ఈ కవిత్వంలో ఆకట్టుకునే మరో అంశం భాష. ఏ గొంతుకతో కవిత్వాన్ని రాస్తే ఆ పరిధిలోని ప్రతీకలని వాడటం పైకవితలోని 'పురుగు కొరికిన పత్తికాయ'లాంటివి సందర్భోచితంగా చాలా చోట్ల కనిపిస్తాయి. 'మాతృత్వం' కవిత శబ్దలాఘవాన్ని బాగా వాడుకున్న కవిత. కొన్ని పదాలు ఉద్వేగం సృజించినట్లు కన్పించినా భాషాపటిమకు ప్రాతినిధ్యం వహిస్తాయి.

శరీర శకలాలు (44.పే) అవ్యక్తభాగం (పే.15) భావాంధకారం. దీపపు నెర్రలు (పే. 45) కాలుష్యాంధకారం (పే.45) ఫలదీకరణ ప్రయోగ యజ్ఞం (పే.44) నీరస నిస్తేజ నాడీ మండలం (పే.66) ఇలా చాలా పదాల్ని ఎత్తి రాయొచ్చు. స్వేచ్ఛ రాత్రి, పగలు, స్వప్నం, అధికారం ఇలాంటి పదాలకు అర్థ సంబంధంగా ఈ సంపుటిలో ఉదాత్త జీవనం ఉంది. అనువాద కవితే అయినా 'స్వేచ్ఛాగీతం' ఓల్గా కవిత్వానికి నేపథ్యంలాంటిది.

"ఎక్కడ మనస్సు నిర్భయమో / ఎక్కడ శిరస్సు సర్వోన్నతమో / ఎక్కడ జ్ఞానం స్వతంత్రమో / ఎక్కడ పరిపూర్ణత అవిశ్రాంత అన్వేషితమో ఎక్కడ వాక్కులు సత్య సంజనితములో / ఎక్కడ సహేతు స్వచ్ఛ ప్రవాహం / మృత ఆచారపు టెడారి దారుల ఇంకనిదో / - / తండ్రీ) ఆ స్వేచ్ఛా తీరంలోనికి / మేల్కొలుపు నా దేశాన్ని" (పే.87)

**రచయిత సెల్ : 9177260385**

## పోరాటమంటే...

సిరిసిల్లా గఫూర్ శిక్షక్
9849062038



కమ్ముకున్న మేఘాలను చీల్చుకుంటు
వెలుగునివ్వ ప్రసరించే శశికాంతుల
ఆరాటం ఓ, పోరాటం

గుండెలోతుల్లోంచి ఉబికిన
అశ్రుధారల చలనంగా
ఎత్తిన పిడికిలిని
విజయ దివిటీగా మార్చే
వీరుడి ఆక్రోశం ఓ పోరాటం

ఆ నింగితో, సాగే ఈ కాలంతో
చకోర చూపుల సంఘర్షణ ఓ పోరాటం
న్యాయపు చితి మంటలపై
నిజాయితీ, ధర్మాల శపథం ఓ పోరాటం

చెత్త కుప్పల్లోన ఎంగిలి మెతుకుల నేరిన చేయి
పిడికిలిగా మారి ఆకాశమవ్వడం ఓ పోరాటం

మనసు నినాదమైనప్పుడు
మనిషి ఉద్యమమైనప్పుడు
మనిషీ, మనసుల దివ్య చైతన్యం
ఓ పోరాటం
పోరాటానికి లక్ష్యం, తీరం న్యాయం
ఉద్యమానికి సాక్ష్యం, ప్రాణం, నినాదం

మౌనకాళరాత్రుల్లో
బతుకును కాలరాసిన ప్రశ్నకు
చీకట్లను చీల్చే
ఉదయ కిరణాల జవాబు ఓ పోరాటం

నీతి ఆత్మ గుడ్డిదయ్యి
అవినీతి కళ్ళు తెరిచినప్పుడు
సత్యపు మార్గం వీడిన న్యాయం
అక్రమాల విష వృక్షపు విత్తులుగా
మారినపుడు
మనిషిలోని మనసు వీణ
పలుకు నాదం పోరాటం
పోరాటమంటే....
అధర్మాన్ని ధనుమాడే వేట
చైతన్య దీపాలు వెలుగయ్యి
కనిపించే
నినాదాల తోట
పోరాట మంటే...
బంధన విముక్తి బాట
ఉద్యమ ఉషస్సుల
మైత్రి పాట.

---

## మాకో చెరువుండేది

తోకల రాజేశం
✆: 9676761415



మా యింట్లో అనునిత్యం
సుడులెత్తే కన్నీటి సముద్రంలాగే
మాకో చెరువుండేది
దాని ఉపరితలం చూసినప్పుడల్లా
ఏ కల్మషమూ లేని మా అమ్మమ్మ మొహమే గుర్తొచ్చేది

శూన్యాకాశం నుంచి
వాననీటి బిందువులు పురుడుపోసుకున్నట్లు
కొత్త నీటితో బాటు
చెరువు నిండా జలపుష్పాలు పుష్పించేవి

సాయితగాళ్లందరూ గుంపులు గుంపులుగా సంచరించినట్లు
బుడ్డపర్కలు గుంపులతో వచ్చి
మాతో నీటి భాషలాడేవి
చేతిలోకి తీసుకుంటే
విలవిల్లాడిపోయేవి మాచిట్టి గుండెల్లాగే

కార్తీక పౌర్ణమి రోజున జలభాగాలన్నీ
దీపాలతో వెలిగిపోయినట్లు
మా చెరువు మూడు మాసాలూ
తామరపూల దీపాలతో కళకళలాడుతూ వుండేది

మమ్మల్ని చిన్నప్పుడు బడి నుంచి పారిపోకుండా
కాపుకాసే మా పెద్దసారులా
చెరువుగట్టు నీటినీ అదిలిస్తూ అదుపులో పెట్టేది
గట్టు వెనుక పూచిన పచ్చదనంతో
పొలాలన్నీ పైరగాలులతో సయ్యాటలాడుతుండేవి

తల్లిబిడ్డకు పాలిస్తున్నంత తన్మయంగా
చెరువు తూముగుండా పొలాలనోటికి నీళ్లు పట్టేది
నీరటిగాళ్లు కళ్ల మీటరుతోనే
పొలాలకు నీటి పంపకాలు చేసేవాళ్లు

మా ఊరికి సముద్రంలా
మా అందరికీ అన్నం పెట్టే అమ్మలా
పుట్టెడు నీటి గుండెతో
ఆరు కాలాలూ పచ్చగా దీవిస్తూ
వుండేది మా చెరువు

కథ

ఎస్. జగదీశ్వరి
✆ : 9490949523



# మధుర స్వప్నం

నీకు ఏ అంకె ఇష్టం ?

"ఐదు"

ఎందుకు ?

నేను ఐదో క్లాసు. మా ఇంట్లో ఐదు ఉంది. మా ఇల్లు ఐదో వీధిలో ఉంది. ఇంకా చెప్పు?

చెప్పాలా! చెప్తాను !

సంవత్సరంలో ఇష్టమైన నెల "ఐదు", అర్థం కాలేదా! అదే "మే" నెల.

ఎందుకంత ఇష్టం 'మే' నెల అంటే? ఎందుకా ....

అది మానెల. మా బాలల నెల. మాకు స్వేచ్ఛా స్వాతంత్రాలు తెచ్చే నెల. విహంగాల వలె మేము స్వేచ్ఛగా విహరించే నెల. అందుకే నాకు ఐదంటే ఇష్టం, ఇష్టం.

ఇంకా చెప్పనా... "ఐసు" బండి వచ్చే నెల. పాలైస్ అంటే ఇష్టం కదా మరి... అని చిన్న చిన్న మాటలతో ముద్దు ముద్దుగా చెపుతున్న చిట్టిని చూసి మురిసిపోయాడు పట్నం నుండి పల్లెకు వచ్చిన మామయ్య నిజమే .....

"బాల్యం ఒక మధుర స్వప్నం తీపి జ్ఞాపకం"

"అలారం" అవసరం లేకుండా, అమ్మ "సుప్రభాతం" (తిట్ల) వినకుండా, వేకువనే ఐదు గంటలకు నిద్రలేచి సుశిక్షిత సైనికుల్లా, బిలా బిలా బయటకు వచ్చిన పిల్లలను చూచిన 'ఉష' వారికంటే ముందు బయటకు రావాలని తాపత్రయపడుతూ తనకు అడ్డురావద్దని మేఘాలను అభ్యర్థిస్తున్నట్లుగా ఉంది (సూర్యోదయ దృశ్యం) ఉషోదయ దృశ్యం.

పరుగు పందాలు, గుర్రపుస్వారీలను మరిపించే సైకిలు స్వారీలు, చెరువులో ఈతలు, కోతికొమ్మచ్చి ఆటలు. "ఆడ - మగ భేదం లేదు. బీద - గొప్ప తారతమ్యం లేదు. కులమతాల ప్రసక్తి అసలే లేదు. ఆటలే ఆటలు. సందడే సందడి. ఆనందమే ఆనందం.

"సమయపాలనలో" గాంధీజీ తర్వాత వీరేనా అన్నట్లుగా దినచర్యలు ఉదయం ఎనిమిది గంటలకల్లా రామయ్య గారి తోటలో సమావేశాలు, చర్చలు. దాగుడుమూతలు, దొంగ-పోలీస్ ఆటలతో బిజీ బిజీ. పాలేరు వచ్చి పిలిచేదాకా ఆకలి తెలియదు. అమ్మ తిట్లతో వేడి వేడి టిఫిన్ తిని మరల ఉరుకులు, పరుగులు.

"ఎండలో ఆడకు", అనే నాయనమ్మ అరుపులు, "ఆడపిల్ల ఇంటి పట్టున ఉండి పనీ-పాట నేర్చుకోక, పాలేరు పిల్లతో ఏమిటా ఎగురుళ్ళు", అనే తాతయ్య కేకల వంటి ఉరుముల మధ్య మెరుపులా, ఆగని జడివానలా తుర్రుమని పరుగెత్తింది చిట్టి. అప్పుడే పడుతుంది "కులమతాల ఆనందానికి, ఆప్యాయతలకు అడ్డురావు" అనే సమభావానికి, సమతాభావానికి నాంది పడుతుంది.

భానుడి ప్రకాశము అధికమయ్యే వేళలలో పిల్లల సమావేశము సీతమ్మ గారి చావిట్లోకి మారింది. అచ్చనగాయలు, బారాగష్టా, పాముపటము, చింతపిక్కలు, క్యారం బోర్డు ఒకటేమిటి ఎన్నో-ఎన్నెన్నో ఆటలు, అల్లర్లు, ఆనందాల వెల్లువలు. "ఆడపిల్లలాగ అచ్చనగాయలా అన్న రవిగాడి నెత్తి మీద పడ్డ మొట్టికాయలు" ఆడ-మగ భేదభావం

# వలస దోహదం

డా. రాజేశ్వరి

934316723



తల్లిదండ్రుల కలల పంటను
బస్తాల కెత్తాలని బయలు దేరిన వాళ్ళు,
ఆకాశానికి ఎగిరి వెళ్ళేముందు
మబ్బు అంచుల చివర
కనబడే బొమ్మరిళ్ళ దారిలో
చినప్పుడు ఊయలూగిన
చెట్టు కొమ్మ కనబడుతుందేమో నని
తొంగి చూస్తుంటారు

పశ్చిమ సూర్యోదయంలో
ఒంటరి కాళ్ళను దించుకున్నాక
అమ్మ అన్నంపెట్టి రమ్మంటే
సాకు చెప్పి తప్పించుకున్న వాళ్ళు

ఇప్పుడు గరిట సాము చేసి
ఉడికించుకుంటారు

మునుపు మిత్రులతో
భుజాలు రాసుకుని తిరిగిన వాళ్ళు
ఇపుడు స్నేహితులతో
కలసి పంచుకోవాలనుకునేసరికి
కళ్ళు తెరచుకుంటారు

కన్న వాళ్ళతో తెగవాదులాడి
తప్పనిసరి జేబు ఖర్చు లాగించిన వాళ్ళు
ఇపుడు సంపాదన విలువ తెలిసి
ప్రతి ఖర్చు లెక్కించుకుంటారు

పరాయి దేశంలో
రహదారి గమ్యం వెతుకుతున్న వాళ్ళు
బ్రతుకు విస్తారం తెలిసి
సముద్రంలో బిందువు కావాలనుకుంటారు.

వలస దోహదానికి
మమకారం పుట్టుకొచ్చి
తెలుగు వినబడితే చాలు
పలుకు చప్పరిస్తుంటారు

మమ్మీ డాడీ అంటూ మారాం చేసినవాళ్ళు
అమ్మా నాన్నల మీద బెంగపెట్టుకుంటారు

చిందర వందర గదిలో
బట్టల రేవుకు మూట కట్టిన వాళ్ళు
అమ్మ కొంగు చాటు తగలక
తడి మింగుకుంటారు
తీపి ఇల్లు తీగెను లాగి
కుశల ప్రశ్నలకు జవాబు తడిమి
ఊరడిల్లు తుంటారు

అపుడెపుడో కాలి దెబ్బకు తగిలిన మట్టిని
మంచి గురుతుకు మలచుకుంటారు.
దేశమంటే మనుషులేనని తెలుసుకుంటారు
మనిషి మనిషి సంస్కృతికి
మానవత్వం వారధిని కడుతుంటారు

---

ఉండకూడదు అన్న భావానికి నాంది-పునాది. అందుకే అరమరికలు లేని అవధులు లేని అనంత ఆనందానికి నిలయమైన బాల్యం అంటే నాకెంతో ఇష్టం.

సైరన్ మోగితే ఇంటికెళ్ళే కార్మికుల్లా ఒంటిగంటకు ఎవరిళ్ళకు వాళ్ళు. అమ్మ కమ్మని వంటతో కడుపునిండా భోజనం. "మధ్యాహ్నం ఎండలో ఏమిటా ఆటలు? నిద్రపోతల్లీ! అన్న నాన్నమాటలు, చిట్టికి మాట మార్చిన రాజకీయ నాయకుడు గుర్తుకువచ్చాడు. ఎప్పుడూ నిద్రేనా! లేచి చదువుకో అనే నాన్నేనా ఇప్పుడు నిద్రపొమ్మంటున్నాడు. అందుకే చిట్టి, "నాన్న! సంవత్సరంలో పదకొండు నెలలు నీ మాట విని నిద్రపోతాను, ఈ ఒక్కనెల మాత్రం దానిని పాటించను అని మనస్సులోనే ప్రతిజ్ఞ చేసుకొని తుర్రుమంది.

ఇప్పుడు వంతు శీనిగాడి ఇంట్లో, టీచరాట, బుడ్డీలాటలు, బొమ్మల పెళ్ళిళ్ళు, పాలేరుగారి అబ్బాయి కూతురుతో శీనుగాడి కొడుకు పెళ్ళి, పెళ్ళికి డబ్బులు ఎలా? అన్న ప్రశ్నకు "కట్నం లేకుండా పెళ్ళి" అని బుల్లి వీరేశలింగం పంతులు లాగా ప్రతిన పూనారు.

సాయంత్రం 4 గంటల కల్లా రామయ్య గారితోటలో చెట్ల నీడన కబడ్డీ, తొక్కుడు బిళ్ళతో హడావుడి. 6 గంటల కల్లా రామాలయంలో హాజరు. దేముడిని ఏమి కోరుకున్నావు? అని ప్రశ్నించిన పంతులుగారితో, మీదగ్గుతగ్గాలని, మీ గెదె ఎక్కువ పాలు ఇవ్వాలని చెప్పిన సమాధానంతో చిట్టి చేతిలో మరింత పొంగలి పెట్టి దీవించిన పంతులు గారు.

కక్ష, కార్పణ్యాలు, ఈర్ష్యా ద్వేషాలుకు అర్థం తెలియని వయస్సు-మనస్సు, పిల్లల హృదయాలు భగవంతుని నిలయాలు.

పిల్లల ఆటలను చూసి ఆనందంతో మురిసిపోయి వెళ్ళలేక వెళ్ళుతున్న ఉషను చూసి హాయిగా నవ్వుతూ, చల్లగా వెన్నెల కురిపిస్తూ వచ్చింది సంధ్య. ఆరుబయట నులక మంచంలో పిల్లల కోసం ఎదురు చూస్తున్న పెద్దవ్వ చుట్టూ చేరారు పిల్లలంతా. ఇక కథలే కథలు జానపదాలు, పురాణాలు ఒకటేమిటి ఎన్నెనో కథలను 3డి సినిమా లెవల్లో చూపించింది, వినిపించింది, పిల్లలకు పెద్దవ్వ. పులకించి పోయారు పిల్లలంతా.

మేడమీద, ఆరుబయట, చల్లగాలి జోలపాడగా తెల్లటి వెన్నెల దుప్పటికాగా, కమ్మటి కలలతో అబ్దుల్ కలాంగారి "కలలు కనండి - విజేతలవ్వండి" అనే మాటలను సాకారం చేస్తూ నిద్రలోకి జారుకుంది భావి భారత పౌరురాలు చిట్టి. "ఏ చీకూ, చింతా లేదూ. దుఃఖానికి, బాధకు, అతీతంగా జీవితంలో మాధుర్యాన్ని చవి చూపిన బాల్యమా! నీకు జోహార్లు.

★

# కవిత్వంలో వస్తు వైవిధ్య అన్వేషణ !



డా - రాచపాళెం చంద్రశేఖరరెడ్డి

డా. రాధేయ స్వభావతః కవి. కవిత్వ ప్రమోటర్ కూడా. ఉమ్మడిశెట్టి సాహితీ పురస్కారాన్ని నెలకొల్పి రెండు దశాబ్దాలకు పైగా ప్రతి ఏడాదీ ఒక కవిని గౌరవిస్తున్నారు. కవిత్వ రచనపట్ల నిబద్ధత, కవిత్వాభివృద్ధి పట్ల మమత రాధేయకు రెండు కళ్ళు. ఇప్పుడాయన కవిత్వ విమర్శ కూడా చేస్తున్నారు. సంప్రదాయ పదంతోనైతే ఆయనను త్రినేత్రుడనాలి. మొత్తం మీద రాధేయ కవుల జాబితాలో ఉంటూ కవిత్వ విమర్శక జాబితాలోకి కూడా ప్రవేశించారు.

సృజన సాహిత్యం రావడం ఎంత అవసరమో దాని మీద శాస్త్రీయ విమర్శ రావడం ఇంకా ఎక్కువ అవసరం. అయితే తెలుగు సమాజంలో రచయితతో పోల్చి చూచినప్పుడు విమర్శకుల సంఖ్య చాలా పరిమితం. ఈ పరిమిత సంఖ్యలోకి రాధేయ ప్రవేశించి తెలుగు సాహిత్య విమర్శకు తనదైన దోహదం చేస్తున్నందుకు సాహిత్య విమర్శకుడుగా నేను మనసారా అభినందిస్తున్నాను, ఆహ్వానిస్తున్నాను. ఆయన నన్ను కవిత్వంలోకి ఆహ్వానిస్తే నేను ఆయన్ని విమర్శ రంగంలోకి స్వాగతిస్తున్నాను.

గత అయిదారేళ్ళలో ఆధునిక తెలుగు కవిత్వం మీద రాధేయ రాసిన అసంఖ్యాక వ్యాసాల నుంచి ఎన్నుకున్న 25 వ్యాసాలను "కవిత్వం ఓ సామాజిక స్వప్నం" పేరుతో మనకందిస్తున్నారు రాధేయ.

రాధేయ విమర్శ విలక్షణమైనది. ఆయన దశాబ్దాలుగా కవిత్వం రాయడమేగాక, కవిత్వ పాఠకుడుగా కూడా కొనసాగారు. ఆ పఠనంలో ఆయన తెలుగు కవిత్వంలోని వస్తు వైవిధ్యాన్ని గుర్తించారు. ఒక్కో కవిత మీద ఎవరెవరు, ఎప్పుడెప్పుడు, ఏయే కవితలు రాశారో గుర్తించారు. Thematic Study అని ఆంగ్లంలో అనే విమర్శ ధోరణికి చెందినది రాధేయ విమర్శ. సందూక, కుటుంబ హింస, ఇల్లు, మౌనం, బాధ, కన్నీళ్ళు, ఉత్తరం, వసంతం, చినుకు, వ్యవసాయం, టైలర్, చేనేత, చాకిరేవు, జాలరి, కుమ్మరి, బస్సు ప్రయాణం, రైలు ప్రయాణం వంటి వస్తువుల మీద వచ్చిన కవితల్ని పరామర్శించిన వ్యాసాలు ఈ పుస్తకంలో ఉన్నాయి.

తెలుగు కవి వస్తుపరంగా సాధిస్తున్న విస్తృతి, వస్తుపరంగా ప్రదర్శిస్తున్న మౌలికత, తెలుగు కవులు చేస్తున్న కవిత్వ ప్రయాణం వీటిని ఈ వ్యాసాలు పాఠకులకు సులభంగా అందిస్తున్నాయి. ఇలాంటి వ్యాసాలు రాయడానికి రెండు అర్హతలు కావాలి. 1. విస్తృతమైన కవిత్వ పఠనం 2. వస్తు నిర్దిష్టతను గుర్తించే జ్ఞానం. మొదటిది ప్రయత్నం, రెండవది ఫలితం. రాధేయ నిరంతరం కవిత్వ సంపుటులు, సంకలనాల మధ్య సంచరిస్తూ ఉంటారు. ఎక్కడ ఉద్యోగం చేసినా అక్కడికి కవిత్వాన్ని మోసుకు పోతుంటారు. ఆధునిక తెలుగు కవిత్వం మీద పరిశోధన చేసి వస్తు నిర్దిష్టతను, వైవిధ్యాన్ని గుర్తించడం అభ్యసించారు.

ఒక కవి. ఒక కావ్యం, ఒక ఉద్యమం, ఒక భావజాలం, ఒక ప్రాంతం, ఒక సామాజిక వర్గం, ఒక ఛందస్సు ఒక కాలం ఇలా అనేక ప్రయాణాలు ఆధారంగా తెలుగు కవిత్వ విమర్శ వస్తున్నది. రాధేయ వీటినన్నిటినీ వదిలిపెట్టి తెలుగు కవులంతా కలిసి ఏయే వస్తువుల్ని కవిత్వీకరిస్తున్నారో గుర్తించి వ్యాఖ్యానించారు. ఒక్కొక్క

# నిజనిర్ధారణ

పి. లక్ష్మణ్‌రావ్

✆: 9441215989



పగలూ రాత్రి
మెదడులో మల్లగుల్లాలు పడ్డాక
నిన్నా నేడు
మనసులో అక్షర యుద్ధం ముగిసాక
కవితా వాక్యం
ఎలాగుండాలో తేలిపోయింది !

మట్టి పొరల్ని
నిశ్శబ్దంగా చీల్చుకొచ్చిన
చైతన్య విత్తులా
వాక్యం పిడికిలి బిగించాలి !

ఆకాశాన్ని
నిలువునా చీల్చిన
మెరుపుకత్తిలా
వాక్యం పదునుదేరాలి !

పర్వతం గుండెల్లో పుట్టి
భూమాతను అభిషేకిస్తున్న
జలపాతంలా
వాక్యం వినమ్రశీలి అవ్వాలి !

గుండెల్లో బడబాగ్ని రగులుతూ
బద్దలైన మరుక్షణం
ఎగిసిపడే లావాలా
వాక్యం ద్రవించాలి !

భూగర్భంలోని జీవజలాన్ని
ఉప్పొంగించే బలమైన అస్త్రంలా
వాక్యం వాడిగా ఉండాలి !

తనలో తాను దగ్ధమౌతూ
లోకానికి వెలుగునిచ్చే
సూర్యకిరణంలా వాక్యముండాలి !
ప్రగతి పథానికి బాటలు వేసే
తల్లిదండ్రుల చల్లని దీవెనలా
వాక్యంలో ఆత్మీయ స్పర్శ ఉండాలి !

వ్యాకులత చెంది కవి మనసునుండి
విస్ఫోటనమయ్యే వాక్యం
లక్ష్యం వైపే దూసుకుపోవాలి !
సంస్కరణ శీలియై
సత్కవి కలం దీపంలా
భావ చైతన్య కాగడాలు వెలిగించే
కవితా వాక్యం
సమాజంలో విస్తరించాలి !

---

వ్యాసంలో కనీసం ఇరవైమంది కవుల్ని ఉదాహరించారు. అంటే ఒక వస్తువును ఇరవైమంది కవులు వాళ్ళ వాళ్ళ అవగాహన నుండి, భావజాలం నుండి నిబద్ధత నుండి కవిత్వీకరిస్తున్నారన్న మాట. మనుషులు నిరంతరం వాడుకొని వదిలేసే వస్తువులు, మనుషులు, నిరంతరం అనుభవించే అంశాలు, చేసే పనులు కవులకు కవిత్వ వస్తువులై ఎలా కళారూపం పొందాయో ఆవిష్కరించే ఈ విమర్శా ప్రక్రియ గొప్ప పరిశోధన. క్రమశిక్షణతో కూడిన శ్రమ. ఒకే వస్తువు మీద రాసిన కవుల్ని రాధేయ ఆలింగనం చేసుకుంటారు. వాళ్ళ కులం, మతం, ప్రాంతం, జండర్‌లతో సంబంధం లేకుండా గురజాడ నుండి ఈగ హనుమాన్ దాకా. కందుకూరి నుండి కందుకూరి శ్రీరాములు దాకా కొన్ని వందల మంది కవులు ఈ పుస్తకంలో మనకు పరిచయమవుతారు. అయితే రాధేయకు కవి దృష్టి కన్నా వస్తు దృష్టి ప్రధానంగా ఉంటుంది. అందువల్ల వ్యక్తి ఆరాధనకు అవకాశం లేకపోయింది. వస్తు దృష్టి ప్రధానంగా ఉన్నప్పుడు సమాజ దృష్టి పెరుగుతుంది. ఎవర్నో ఆకాశానికెత్తడం గాని, ఎవర్నో పాతాళానికి తొక్కడం గాని ఉండదు. వ్యక్తి దృష్టి ఉండదు. సమూహదృష్టి ఉంటుంది. రాధేయ విమర్శలో ఈ దృష్టి సాకారమయ్యింది.

రాధేయ విమర్శా వ్యాసానికి ఒక ప్రణాలిక ఉంది. కవిత్వంలో ఆయన కుండే సాధారణ అభిప్రయాలు చెప్పడం, తర్వాత ఏ వస్తువు మీద వచ్చిన కవితల్ని పరిశీలిస్తున్నారో ఆ వస్తువు నేపథ్యాన్ని వివరించడం, చివర ఆ వస్తువు మీద ఎవరెవరు ఎలా కవితా వ్యాఖ్యానం చేశారో సోదాహరణంగా విశ్లేషించడం. ఇదీ రాధేయ విమర్శా పద్ధతి. ఇది హేతు బద్ధమైన విమర్శా విధానం. ఒక వస్తువు మీద అనేకమంది రాసి. కవితలలోని వైవిధ్యాన్ని కూడా గుర్తించిన రాధేయ కవిత్వ పరిశీలనలో లోతులకు ప్రయాణించి నట్లే.

ప్రణాళికలు లేని, లేదా సరైన ప్రణాళికలు లేని విమర్శల వలననే తెలుగు సాహిత్య విమర్శల పరిపక్వత మీద అనుమానాలు, దెప్పిపొడుపులు వ్యక్తమవుతున్నాయి. సాహిత్య విమర్శకు సరైన ప్రణాళిక ఉండడం ఎంత అవసరమో, దీనిని జాగ్రత్తగా అమలు పరచడం కూడా అంతే అవసరం. రాధేయ ఈ రెండంశాలలో ప్రమత్తుడుగానే వ్యవహరించారు. కాకపోతే ఆయనకు కవితావేశమేకాదు, కవిత్వ వ్యామోహం కూడా ఉంది. తాను ఎన్నుకున్న వస్తువు మీద కవితలు దొరుకుతుండే వాటిని ఉదహరించడంలో నిమగ్నమైపోయి తాను విమర్శకుడనే విషయాన్ని కాసేపు మరచిపోతారు. అందుకే ఈ గ్రంథంలో కవితల ఉటంకింపుల శాతం అధికమైంది. కవిత్వ విమర్శకులు ఇక్కడే నిగ్రహంగా ఉండాలి.

ఒక విమర్శ గ్రంథం రెండు ప్రయోజనాలను నెరవేర్చినప్పుడే అది ఉన్నత విమర్శ అవుతుంది. 1. పాఠకులను సాహిత్య పఠనానికి ప్రేరేపించాలి. 2. ఒక విమర్శ గ్రంథం తర్వాతి విమర్శకులను కదిలించి ఆ మార్గంలో మరికొంత విమర్శ రావడానికి తోడ్పడాలి. రాధేయ విమర్శ ఈ రెండు ప్రయోజనాలను నెరవేర్చగలదని ఆశిస్తున్నాను.

తెలుగు కవిత్వంలోని వస్తు వైవిధ్యాన్ని అన్వేషించి, ఆవిష్కరించి, తెలుగు కవుల సామాజిక స్వప్నాలను వ్యాఖ్యానిస్తున్న రాధేయకు అభినందనలు.

రచయిత సెల్ : 9440222117

# ముందుకుసాగి పోతారు

- భూషి కృష్ణదాసు



నెత్తి మీద బరువుతో
వీధి వీధి తిరుగుతున్న తుంగ చాపలమ్మేవాడూ
కాళ్ళకు చెప్పులు లేకుండా గల్లీ గల్లీ తిరిగి
పూలకుండీలమ్ము కునే
తోపుడు బండివాడూ
కసరత్తు చేస్తున్నట్టు రిక్షా తొక్కుతూ
ముగ్గు అమ్ముకునే ఆపుణ్యవతీ-
వీళ్ళు ఈకష్ట జీవులంతా నడిచి
సంచారం చేయడం వల్లనే
ఆరోడ్లు ఈ గల్లీలు అన్నీ పావనమయ్యాయి
వీళ్ళ అవసరం సమాజానికి వున్నా

గుర్తింపులేని వాళ్ళు గానే మిగిలిపోతారు
విధికరచిన శాపగ్రస్తులు వీళ్ళు
వీళ్ళు దోపిడీ ఎరుగని నిస్వార్థ సేవాపరులు
కష్టాన్ని నమ్ముకొని బ్రతుకుతున్న
శ్రమైక జీవులు
పై నుంచి చెమటను కురిపిస్తున్న
చండ మార్తాండుడు కూడా
వొక్కోపరి వీళ్ళ కష్టాన్ని చూసి
నిష్క్రమించాలనుకుంటాడు రాత్రిలోకి

కృషితో బ్రతుకు బండిలాగిస్తున్న వీళ్ళు
తనపై నుంచి నడిచిపోతున్నా
బరువని అనుకోదు భూమి ఎప్పుడూ
భక్తిగా వీళ్ళ కాళ్ళ ధూళిని
నెత్తిన మోస్తూ పరవశించిపోతుంది
వీళ్ళు రోజూ బ్రతుకు తిరుగలిలో
పదే పదే నలిగిపోతున్నా
బాధల ఉరితాడు మెడకు చుట్టుకొని
విలవిలా కొట్టుకోరు

వీళ్ళు శ్రమను నమ్ముకున్న కష్టజీవులు గనుక
ఎన్ని అలజడుల ఆటుపోట్లెదురైనా
భయపడక
ముందుకు సాగిపోతారు

---

# అనీమియా

- సంగెవేని రవీంద్ర
✆: 09987145310



పేజీల దేహాల్లో ప్లేట్‌లెట్స్ తగ్గాయి...
భావోద్వేగాల హిమోగ్లోబిన్ ఎక్కించాలి...
రక్తం రంగులు మారుతున్న
సదృశ్యం కళ్ళముందు కదలాడుతోంది...
పేరా పేరాకు మధ్య పేరుకున్న
చీమూ నెత్తురు లేని బ్లాకేజీలు
చిరాకు పెడుతున్నాయి...
పేజీల్నిండా స్మశానాల సందడే సందడి...
బాక్సయిటమ్‌లో దాక్కున్న
తాచుపాముల బుసబుసలు
లేత కిరణాలపై గబ్బు రోతను
చిమ్ముతుంటాయి...
అక్షరాన్ని ద్రౌపది చేసి
జాతి, మత, కుల, ప్రాంత, 'మద్య',
వంధ్యశిలపై వలువలు వలిచే వైనం...
ఫీచర్సన్నింటిని ఆక్రమించుకున్న
అభినవ చాణక్యం...
'కాలమ్స్' నిండా పేరుకొన్న
ప్రసంగాల పరంపరలు...
ఎక్కడా ఓ చుక్క కరుణలేని ఆ ఎడారుల్లో
తడారిన సామాన్యుడు...
'వాతావరణం'లో ఎండు చూపుల్ని
పోగేసుకుంటున్నాడు...
అక్కడ తప్ప వాడెక్కడా కనిపించని చోద్యం...
ఎప్పట్లాగే ఈ ఉదయం కూడా....
నా అనాసక్త చూపు కొనలపై
తడబడుతున్న మంచు బిందువులు....
చురకత్తుల్ని పేనుతున్నాయి...
సరిదిద్దాలనే ఉంది...
కానీ సిరాబుడ్డికి కూడా
అనీమియా పట్టుకుందేమో....!
నిప్పురవ్వల్ని రగిలించాలి...!!!

# జాతీయోద్యమం - సంఘర్షణలు

జయంతి పాపారావు



**ఇండియాలో దొరుకుతున్న వస్తువులను కొని, ఇతర దేశాల్లో అమ్మి లాభాలు సంపాదించడమే కంపెనీ ధ్యేయం. రాజ్యాధికారం కోసం యుద్ధాలు చేస్తూ నష్టాల్లో కూరుకుపోవడం ఎందుకు? అని కంపెనీ డైరెక్టర్లు తమ అధికారులను హెచ్చరించారు. బెంగాలును స్వాధీనం చేసుకోవడం వల్ల, కంపెనీ ఆదాయం బాగా పెరుగుతుందని లెక్కలు చెప్పి, క్లైవ్ కంపెనీకి 1765 సెప్టెంబర్‌లో జవాబు రాశాడు.**

"నీ దేశ చరిత్ర నీకు తెలియకపోతే నీ సమాజాన్ని ఎలా తెలుసుకోగలవు?"

భారతదేశంలో రెండో స్వాతంత్ర్య సమరం అనివార్యమన్న ఆలోచన ప్రజల్లో రగుల్కొంటున్న నేటి సందర్భంలో, జాతీయోద్యమం గురించి నాలుగు మాటలు మాట్లాడుకుందాం.'

భారతదేశంలో జరుగుతున్న విదేశీ వ్యాపారం మీద ఆధిపత్యం సాధించాలని ఫ్రెంచి కంపెనీ గవర్నర్ డూప్లే సంకల్పించాడు. 1740లో భారత యువకులను సిపాయిలుగా చేర్చుకుని సైనిక శిక్షణ ఇప్పించాడు. 1744లో మద్రాసులోని ఆంగ్లేయుల మీద దాడి చేసి సెంట్ జార్జికోటను వశపరచుకున్నారు కానీ, తరువాత కోల్పోయారు. ఆ యుద్ధంలో భారత సిపాయిల వినయ విధేయతలు పోరాటశక్తి చూసిన బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు 1746 నుంచి భారత యువకులను సిపాయిలుగా చేర్చుకోవడం ప్రారంభించారు. బ్రిటిషు ఈస్ట్ ఇండియా కంపెనీ 1600 సంవత్సరంలో రిజిస్టర్ చేయబడింది. 1612లో సూరత్‌లో వ్యాపార కేంద్రాన్ని స్థాపించారు. భారత యువకులను సైన్యంలో చేర్చుకోవడం వల్లే, బ్రిటిషు సామ్రాజ్యం భారతదేశాన్ని పూర్తిగా ఆక్రమించగలిగారు. పేదరికంలో అలమటిస్తున్న భారత యువకులు కేవలం పొట్ట పోషణ కోసమే బ్రిటిషు సైన్యంలో చేరారు.

రాజాదుర్లభరాయ్, మహతాబ్‌రాయ్ వంటి జమీందార్లతోనూ, జగత్‌సేట్, అమీచంద్ వంటి వడ్డీ వ్యాపారులతోనూ బ్రిటిషు కంపెనీకి వ్యాపార సంబంధాలున్నాయి. వారి ద్వారా కెప్టెన్ క్లైవ్ సిరాజుదౌలా సేనాధిపతి మీర్‌జాఫర్‌ను కలుసుకున్నాడు. తాము గెలిస్తే, మీర్ జాఫర్‌కు సింహాసనం కట్టబెడతానన్నాడు. 1757 జూన్ 23న 'ప్లాసీ' యుద్ధం ప్రారంభమయింది. కెప్టెన్ క్లైవ్ కుట్ర - మీర్ జాఫర్ ద్రోహం వల్ల సిరాజు ద్దౌలా ఓడిపోయాడు. ఆ విధంగా బ్రిటిషు కంపెనీ పాలన ప్రారంభమయింది. క్రమక్రమంగా భారతదేశ మొత్తాన్ని ఆక్రమించుకుని 1857 సిపాయిల తిరుగుబాటు వరకూ 100 సంవత్సరాలు కంపెనీ పాలన సాగింది. 1858 నుంచి బ్రిటిషు సామ్రాజ్య ప్రత్యక్షపాలన వచ్చి, 1947లో స్వాతంత్ర్యం వచ్చే వరకూ 90 సంవత్సరాలు కొనసాగింది.

ఇండియాలో దొరుకుతున్న వస్తువులను కొని, ఇతర దేశాల్లో అమ్మి లాభాలు సంపాదించడమే కంపెనీ ధ్యేయం. రాజ్యాధికారం కోసం యుద్ధాలు చేస్తూ నష్టాల్లో కూరుకుపోవడం ఎందుకు? అని కంపెనీ డైరెక్టర్లు తమ అధికారులను హెచ్చరించారు. బెంగాలును స్వాధీనం చేసుకోవడం వల్ల, కంపెనీ ఆదాయం బాగా పెరుగుతుందని లెక్కలు చెప్పి, క్లైవ్ కంపెనీకి 1765 సెప్టెంబర్‌లో జవాబు రాశాడు. ఆనాటి నుంచి, భారతదేశం నుంచి ముఖ్యంగా ముడి పదార్థాలు ఎగుమతి చేసుకుంటూ బ్రిటిషు పారిశ్రామిక ఉత్పత్తులను ఇండియాకు దిగుమతి చేసుకుంటూ అటు రాజ్యాధికారాన్నీ, ఇటు వాణిజ్యాన్ని విస్తరించుకుంటూ పోయారు. అటు బ్రిటిషు పాలనకు, ఇటు దోపిడీకి భారతదేశం బలిపశువయింది. 1850 నాటికి బ్రిటిషు కంపెనీ సైన్యంలో 2 లక్షల 23 వేల మంది భారత సిపాయి లుండేవాళ్లు. 45 వేలమంది బ్రిటిషు సోల్జర్లు ఉండేవాళ్ళు. భారత సిపాయిలలో సంఘీభావం పెంచి తిరుగుబాటు చేయిస్తే, బ్రిటిషు పాలన

అంతమౌతుందన్న ఆలోచన కొందరు దేశభక్తుల్లో రగుల్కొంది. తాంతియాతోపే, మౌల్వీ అహమ్మద్ షా వంటి కొందరు సిపాయిలతో రహస్య సంబంధాలు పెట్టుకున్నారు. కొందరు సంస్థానాధీశులు కూడా చేతులు కలపుతారని ఆశించారు. ప్రజలు కూడా పాల్గొంటారని భావించారు. ఆ దిశలో కృషి చేశారు.

1857 జూన్ 23న వలస పాలకులు ప్లాసీ యుద్ధ విజయాన్ని శత వార్షికోత్సవంగా జరుపుకుంటారని ఆ సందర్భంలో ఆ రోజున తిరుగుబాటు చేయాలని సిపాయిలు రహస్యంగా పథకం వేశారు. ఆనాటికి ముందే భారత సిపాయిల్లో పలు కారణాలవల్ల అసంతృప్తి రాజుకుంటూనే ఉంది. మత విశ్వాసాలను కించపరచడం కొన్ని మత విశ్వాసాలను నిషేధించడం చిన్నచూపు చూస్తూ అవమాన పరచడం క్రైస్తవమతంలో చేరిన తోటి సిపాయిలకు పదోన్నతి కల్పించడం పై పదవులన్నీ బ్రిటిషు సోల్జర్లకే ఇవ్వడం బ్రిటిషు సోల్జర్లు మంచి ఇళ్లల్లో ఉంటే, భారత సిపాయిలు పూరి గుడిసెల్లో ఉండడం వాళ్లకి ఎక్కువ జీతాలూ సదుపాయాలూ ఇవ్వడం వీళ్లకి తక్కువ ఇవ్వడం వాళ్ళు ఫిరంగి దళాల్లో ఉండి యుద్ధం చేస్తే, భారత సిపాయిలను ముందు వరసలో నిలబెట్టడంవల్ల ఎక్కువమంది మరణించడం వంటి పలు కారణాల వల్ల అసంతృప్తి రగుల్కొంటూనే ఉండేది. దేశభక్తితో పాటు, అటువంటి అసంతృప్తి కూడా సిపాయిల తిరుగుబాటుకు కారణమయింది.

అనుకోని విధంగా తిరుగుబాటు మీరట్‌లో 1857 మే 10న ముందుగానే ప్రారంభమయి, ఉత్తర భారతదేశంలో పలుచోట్ల కొనసాగింది. అయితే తిరుగుబాటు పలు చారిత్రక కారణాలవల్ల విఫలమయింది. వేలసంఖ్యలో భారత సిపాయిలూ, కొద్దిమంది భారత జాతీయ నాయకులూ, ప్రజలూ, కొందరు సంస్థానాధీశులూ చంపబడ్డారు. భారీ సంఖ్యలో ఉరితీయబడ్డారు. కఠినంగా శిక్షింపబడ్డారు.

వైఫల్యానికి కారణమయిన కొద్దిపాటి ముఖ్య కారణాలను తెలుసుకుందాం. 1) ఉత్తరాదిన సిక్కు సంస్థానాధిపతులు, కాశ్మీర్ మహారాజు, దక్షిణాదిన నైజాం నవాబు, గ్వాలియర్ ఇండోర్ సంస్థానాధిపతులూ, బ్రిటీషు పాలకుల పక్షాన పోరాడి తిరుగుబాటును అణచివేయడంలో బ్రిటిషు సైన్యానికి సహకరించారు. 2) భారతీయులను పెద్ద పదవుల్లో నియమించలేదు. అందువల్ల యుద్ధంలో ఆరితేరిన వాళ్లు లేకుండాపోయారు. 3) తిరుగుబాటు రహస్యం బయట పడిపోతుందేమో నన్న భయంతో అన్ని చోట్లా పనిచేస్తున్న సిపాయిలకు ముందుగా సమాచారం అందించలేకపోయారు. 4) తిరుగుబాటు సమాచారం అందిన వెంటనే, బ్రిటిషు సోల్జర్లు భారత సిపాయిల నుంచి ఆయుధాలు లాక్కుని నిరాయుధుల్ని చేసి అణచి ఉంచారు. 5) భారత సిపాయిలకు ఫిరంగి దళాల్లో పనిచేసిన అనుభవం లేదు. 6) బాంబే ఆర్మీలోని మహారాష్ట్ర సిపాయిలు, పంజాబు ఆర్మీలోని సిక్కు సిపాయిలూ, క్రైస్తవ సిపాయిలూ, బ్రిటిషు సైనికుల పక్షం నిలబడిపోరాడారు. 7) భారత ధనిక వ్యాపార వర్గం, తమ బాగు, అభివృద్ధి పాశ్చాత్య వ్యాపారవర్గ అభివృద్ధితోనే ముడిపడి ఉంటుందన్న అభిప్రాయంతో ఎప్పుడూ వలస పాలకులకు దన్నుగానే నిలబడ్డారు. అయితే ఝాన్సీ మహారాణి లక్ష్మీభాయి, అయోధ్య నవాబు సతీమణి హజరత్ మహల్ బేగం, తాంతియాతోపే, ఢిల్లీ మొగల్ చక్రవర్తి బహదూర్‌షా భార్య జీనత్‌మహల్, అతని కుమారులు, జగదీశ్‌పూర్ రాణాకుమార సింహుడు, బహదూర్ ఖాన్ వంటి పలువురు సంస్థానాధిపతులు తిరుగుబాటులో పాల్గొని నాయకత్వం వహించారు. వీరోచిత పోరాటాలు చేశారు. అయోధ్య బుందేల్ ఖండ్ లక్నో బరైలీ అలహాబాదు ఆ విధంగా పలు ప్రాంతాల్లో సిపాయిలకు తోడుగా లక్షలాది హిందూ ముస్లిం ప్రజలు ప్రాణాలకు తెగించి పోరాడారు.

ఆ విధంగా, బ్రిటిషు వలస పాలకులు అధికారులు సోల్జర్లు లక్షలాది మంది ప్రాణాలు తీసి, రక్త పాతం సృష్టించి, రక్తాన్ని భారత నేలపైనే కాకుండా, చరిత్ర పుటల్లో కూడా ప్రవహింపజేసి, మానవులుగా పిలవబడే అర్హతను కోల్పోయారు.

వి.డి. సవార్‌కార్ 1857 సిపాయిల తిరుగుబాటును Indian war of independence - గా చారిత్రీకరించాడు.

ఎస్.బి.చౌదరి Civil Rebellions in the Indian mutiny (1857 - 1859) National war of Independence - గా చారిత్రీకరించాడు.

"ఒక వైపు ఇది సిపాయిల తిరుగుబాటు, మరో వైపున ప్రజల పోరాటం, ఈ రెండూ కలిసి ఒక సాంఘిక విప్లవం రూపుదిద్దుకుంది. కేవలం సిపాయిల తిరుగుబాటే దానికి కారణమని వాదించడమంటే, చిరకాలంగా ఇండియాలో సాగుతున్న దుష్ట పరిపాలనను కప్పిపుచ్చడమే ఔతుంది." అని సర్ రాబర్ట్ గార్డినర్, బ్రిటిషు పార్లమెంటుకి పంపించిన నివేదికలో పేర్కొన్నాడు.

"పాలకులకూ, చరిత్రకారులకూ కూడా, సిపాయిల తిరుగుబాటు అనేక హెచ్చరికలు చేసింది. కులమతాలకు అతీతంగా, హిందువులు ఏకమై, మనకు వ్యతిరేకంగా విప్లవ శంఖం పూరించగలరనేది అన్నిటికంటే ముఖ్యమైన హెచ్చరిక" అని జి. డబ్ల్యు. ఫారెస్టు రాశారు. అయితే అది మాత్రం ఆ మార్గంలో జరగకుండా, బ్రిటిషు పాలకులు కఠినమైన సమస్త చర్యలూ తీసుకుని జాగ్రత్తపడ్డారు.

1857కు నాలుగు సంవత్సరాలకు ముందే 1853లో కారల్‌మార్క్స్ ఇలా విశ్లేషించాడు. "ఇండియా ఖర్చుతో, ఇండియన్లే సిపాయిలుగా ఉన్న ఇండియన్ సైన్యమే, ఇండియాను ఇంగ్లీషు వారి బానిసత్వంలో అణచి ఉంచుతోంది". 1858లో బ్రిటిషు ఈస్ట్ ఇండియా కంపెనీ పాలన ముగిసి, బ్రిటిషు సామ్రాజ్య ప్రత్యక్ష పాలన ప్రారంభమయింది. 1857 తిరుగుబాటు ప్రజల్లో స్వాతంత్ర్యం ఆకాంక్షను ఉత్తేజపరిచింది. అది జాతీయోద్యమం దిశలో ప్రవహించింది.

జాతీయోద్యమం రెండు రూపాల్లో రూపు దిద్దుకుంది. ఒకటోది Secular nationalism. కుల-మత-వర్గ-భావజాలాలకూ,

**1857కు నాలుగు సంవత్సరాలకు ముందే 1853లో కారల్‌మార్క్స్ ఇలా విశ్లేషించాడు. "ఇండియా ఖర్చుతో, ఇండియన్లే సిపాయిలుగా ఉన్న ఇండియన్ సైన్యమే, ఇండియాను ఇంగ్లీషు వారి బానిసత్వంలో అణచి ఉంచుతోంది".**

భిన్నత్వాలకు – అతీతంగా – లౌకికవాద జాతీయత – ఏర్పడింది. రెండోది – Communal Nationalism. కులం – మతం – భాష – వంటి భిన్నతత్వాలున్నప్పటికీ – ఒక గ్రామంలో అందరూ కలిసి జీవిస్తున్నట్లు, కలిసిమెలిసి జీవించే భిన్నత్వంలో ఏకత్వం కలిగిన జాతీయత. ఈ రెండు విధాల జాతీయతలూ 1880లో ఇంచుమించుగా ఒకేసారి సమాంతరంగా రూపుదిద్దుకున్నాయి. ఈ రెండో జాతీయతలోంచే బ్రిటిషు వలస పాలకుల విభజించి, పాలించు – రాజ్యవ్యూహం రూపు దిద్దుకుంది. Communel nationalism ను Extremist Nationalism – గా కూడా పిలుస్తారు. Secular Nationalism– ను Modrate nationalism – గా పిలుస్తారు.

1857 – 1859 తిరుగుబాట్లు బ్రిటిషు పాలకులు క్రూరాతి క్రూరంగా అణచి వేశాక, భారత మధ్య తరగతి మేధావివర్గం ప్రత్యామ్నాయం కొరకు అన్వేషణ ప్రారంభించారు. కార్మికుల, రైతుల దుస్థితిని ప్రజల పేదరికాన్ని నిర్మూలించే మార్గంలో సభలు ప్రారంభించారు. పూనాలో సార్వజనిక సభ కలకత్తాలో ఇండియన్ అసోసియేషన్ మద్రాసులో మహాజన సభ బాంబేలో ప్రెసిడెన్సీ అసోసియేషన్ స్థాపించబడ్డాయి. అందరూ కలిసి కట్టుగా తీర్మానాలు చేయడం పోరాటాలు సాగించడం అవసరమని ఆ ప్రజా సంస్థలు గుర్తించాయి. 1883లో మొదటి జాతీయ సభ 1885లో రెండో జాతీయ సభ జరిగాయి. బ్రిటిషు పాలకుల దోపిడీ ఆర్థిక విధానాల వల్ల మనదేశంలో పండించిన తిండిగింజలు ఇక్కడి ప్రజలకు మిగల్చకుండా, లాభాల కోసం ఎగుమతులు చేయడం వల్ల పేద ప్రజల ఆకలి చావులు తీవ్రస్థాయికి చేరుకున్నాయి. "1850 – 1875 మధ్యకాలంలో 50 లక్షలమంది భారతీయులు కరువు వల్ల మరణించగా, 1875 – 1900 మధ్య కాలంలో 150 లక్షల మంది భారతీయులు కరువులవల్ల మరణించారు". అని డబ్ల్యు.ఎస్ విల్లీ ప్రకటించారు. తిరుగుబాట్లు అణచి వేయబడుతున్నప్పటికీ, ఎక్కడో అక్కడ కరువు బాధలు భరించలేక ప్రజలు తిరగబడుతూనే ఉన్నారు. ఆనాటి పరిస్థితిని సర్ విలియం వెడ్డర్‌బర్న్ ఇలా వర్ణించాడు. "దురదృష్టకరమైన అభివృద్ధి నిరోధక చర్యలూ, క్రూరమైన పోలీసు దమనకాండ కలిసి ఇండియాలో విప్లవ పరిస్థితులు సృష్టించాయి. లార్డ్ విరిప్పన్ వైస్రాయిగా ఉన్న సమయంలో విప్లవం దూసుకు రాకతప్పదనిపించింది."

ఆ సందర్భంలో Allan octovian hume వైస్రాయి డఫెరిన్‌ను కలిసి సలహా ఇచ్చాడు. "కష్టజీవుల పోరాటాలకు అతివాద మేధావులు (సురేంద్రనాథ బెనర్జీ వంటి మేధావులు) నాయకత్వం వహిస్తే, స్థానిక పోరాటాలు జాతీయ తిరుగుబాటు ఉద్యమాలుగా పరిణమించ వచ్చును." అని సలహా ఇచ్చాడు. డఫెరిన్ ఒప్పుకున్నాడు. ఆ విధంగా జాతీయ మహాసభ నేషనల్ కాంగ్రెస్ స్థాపనకు దారి ఏర్పడింది.

హ్యూమ్ పూనికతో 1885 డిసెంబరు 28న బాంబేలోని గోకుల్ దాస్ తేజ్‌పాల్ సంస్కృత కళాశాలలో తొలిసభ జరిగింది. ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ భారత జాతీయ కాంగ్రెస్ ఏర్పడింది. 72 మంది ప్రతినిధులు పాల్గొన్నారు. వైస్రాయ్ కౌన్సిల్ మెంబరుగా ఉన్న విలియం చంద్ర బెనర్జీ సభాధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. హ్యూమ్ కార్యదర్శిగా ఎన్నుకోబడ్డాడు. పరిపాలనలో భారతీయులకు తగిన స్థానం కల్పించాలని, ప్రజల న్యాయమైన కోర్కెలను తీర్చాలని తీర్మానాలు చేశారు. భారత జాతీయ కాంగ్రెస్ ఒక వేదికగా మాత్రమే ఆవిర్భవించింది. ఆ తరువాత పలు శాఖలు ఏర్పడ్డాయి. ప్రతినిధుల సంఖ్య బాగా పెరిగింది. ప్రతి ఏటా సమస్యలను విశ్లేషిస్తూ, తీర్మానాలు చేసి బ్రిటిషు పాలకులకు పంపిస్తూ ఉండేవాళ్లు. వాటిని పాలకులు పట్టించుకోలేదు. దాదాభాయ్ నౌరోజీ, ఫిరోజిషామెహతా, దిన్షా ఎడాల్జీవాచా, సురేంద్రనాధబెనర్జీ, బద్రుద్దీన్ తయాబ్జీమున్నగువారు నాయకులుగా ఉంటూ ఉండేవాళ్ళు. 1891 సభల వరకూ తీర్మానాలు పంపడమే జరిగింది. అవి సాధించిన ప్రయోజనం ఏమీలేదు. "బారిస్టర్ ఫిరోజిషా మెహతా తన వృత్తిలో తీరికలేకుండా ఉన్నాడు. మిస్టర్ తెలాంగ్ తన వ్యావకాల్ని పెంచుకున్నాడు. ఈ విధంగా అందరూ బంగారాన్ని కూడ బెట్టుకోవడంలోనే నిమగ్నమయితే, దేశాభివృద్ధి ఎలా జరుగుతుంది?" అని దిన్షా ఎడాల్జీ వాచా, దాదా భాయ్‌నౌరోజీకి ఉత్తరం రాశాడు.

**హ్యూమ్ పూనికతో 1885 డిసెంబరు 28న బాంబేలోని గోకుల్ దాస్ తేజ్‌పాల్ సంస్కృత కళాశాలలో తొలిసభ జరిగింది. ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ భారత జాతీయ కాంగ్రెస్ ఏర్పడింది. 72 మంది ప్రతినిధులు పాల్గొన్నారు. వైస్రాయ్ కౌన్సిల్ మెంబరుగా ఉన్న విలియం చంద్ర బెనర్జీ సభాధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. హ్యూమ్ కార్యదర్శిగా ఎన్నుకోబడ్డాడు. పరిపాలనలో భారతీయులకు తగిన స్థానం కల్పించాలని, ప్రజల న్యాయమైన కోర్కెలను తీర్చాలని తీర్మానాలు చేశారు.**

1892లో ప్రముఖ నాయకులకు కౌన్సిల్సులో చోటు కల్పించేందుకు, కౌన్సిల్ చట్టం తెచ్చారు. ఓటు హక్కు వంటి హక్కుల లేకపోవడం వల్ల, నిజానికి దానివల్ల ఒరిగిందేమీ లేదు.

1893లో ఉత్తర భారతంలోని పాట్నా (బీహార్) ప్రాంతంలో గోవధ నిషేధం కోసం పోరాటం ప్రారంభమయింది. అదే విధంగా, హిందీలో అరబిక్ లిపికి బదులు సంస్కృతంలోని దేవనాగరిలిపి వాడాలన్న సంఘర్షణ కూడా ఆరంభమయింది. అయితే అదే సమయంలో అన్ని మతాలూ, సాంప్రదాయాలు ఒకే ఒక లౌకిక వాద స్ఫూర్తితో రాజకీయ ఉద్యమం ఊపందుకోవాలన్న కృషి కూడా జరిగింది. దానివల్ల బ్రిటిషు సామ్రాజ్యం కింద భారత స్వపరిపాలన ఉద్యమం బలపడుతుందని సంకల్పించారు. మోతీలాల్ నెహ్రూ మున్నగు సంస్కరణవాద జాతీయవాదులు ఆ దిశలో కృషి చేశారు.

అరబిందో ఘోష్, లాలాలజపతిరాయ్, తిలక్ మున్నగు నాయకులు 1902లో బ్రిటిషు వస్తువుల దిగుమతి ఆపివేయాలని ఉద్యమం ప్రారంభించారు. బెంగాల్ విభజనను వ్యతిరేకిస్తూ 1905 – 1908ల మధ్య ఉద్యమాలు సాగాయి. చారిత్రకంగా చెప్పుకోవాలంటే 1902 నుంచి Mass politics సామాన్య ప్రజల రాజకీయ ఉద్యమం

రూపుదిద్దుకుంది. 1905 నుంచి మద్రాసు రెసిడెన్సీ ప్రాంతం నుంచి సంస్కరణ జాతీయ వాదులు బెంగాల్ ఉద్యమాల్లో పాల్గొన్నారు.

George nathniel curzon వైస్రాయిగా నియమితుడయ్యాడు. ఆసియాలో ముఖ్యంగా ఇండియాలో బ్రిటిషు ప్రభుత్వాన్ని బలోపేతం చేయాలన్నది కర్జన్ సంకల్పం. పాలనా సౌకర్యం పేరుతో బెంగాలును 1905, అక్టోబరు 16న విభజించాడు. దాని వెనుకనున్న రాజకీయ వ్యూహం బయటపడింది. బెంగాలును విభజించకపోతే, బ్రిటిషు పాలనను వ్యతిరేకిస్తూ ఉద్యమాలు బలంగా ఊపందుకుంటాయన్న ఆలోచనతో బెంగాలును విభజించాడు. హిందూ ముస్లింలను విభజించి, శత్రువులుగా మార్చి, అనైక్యత సృష్టించి, ఉద్యమాలను దెబ్బతీయాలని సంకల్పించాడు. వలసపాలకుల అండదండలతో, బెంగాలులోని ముస్లిం భూస్వాములు ముస్లిం లీగ్‌ను 1906లో స్థాపించారు. బెంగాల్ విభజన వ్యతిరేక ఉద్యమంలో భాగంగా సాగుతున్న, బ్రిటీషు వస్తువుల దిగుమతి ఆపు చేయమని సాగుతున్న ఉద్యమాన్ని ముస్లింలీగ్ వ్యతిరేకించింది. బ్రిటీషు వస్తువులను ముస్లిం వ్యాపారులు అమ్మకాలు చేస్తూ ఉంటారు కాబట్టి, ముస్లింలీగ్ తేలిగ్గా వలస పాలకుల వలలో పడిపోయింది.

బ్రిటిషు వస్తువులను, బ్రిటిషు విద్యను బహిష్కరించాలని సురేంద్రనాధ బెనర్జీ మున్నగువారు పిలుపు నిచ్చారు. ఆ ఉద్యమం స్వదేశీ ఉద్యమంగా నడవాలన్నారు. బెంగాల్ విభజన సందర్భంలో భారీ ఎత్తున బహిష్కరణ ఉద్యమాలు పుంజుకున్నాయి. బ్రిటిషు పాలకులు క్రూరంగా అణచివేశారు. బ్రిటిషు దిగుమతుల నిలుపుదల ఉద్యమాన్ని ముస్లిం వ్యాపారులు వ్యతిరేకించారు కాబట్టి ఉద్యమం 'స్వదేశీ ఉద్యమం'గా విజృంభించాలన్నారు. ఆ తరువాత సురేంద్రనాధ బెనర్జీ, అప్పటి కాంగ్రెస్ ప్రెసిడెంటు గోపాలకృష్ణ గోఖలే బ్రిటిషు విద్య బహిష్కరణ ఉద్యమాన్ని ఆపు చేశారు.



స్వదేశీ ఉద్యమం బెంగాల్‌లో విజయవంతమయింది. స్థానిక వ్యాపారుల వ్యాపారాలు కాస్త పుంజుకున్నాయి. చేతివృత్తులకు పిసరంత ప్రాణవాయువు దొరికింది. దిగుమతులు తగ్గాయి. స్వదేశీ వస్త్రవ్యాపారం కొద్దిగా పుంజుకుంది. ఆ విధంగా ప్రజా ఉద్యమం బలపడ్డానికి దారి ఏర్పడింది. ముస్లింల వ్యతిరేకతవల్ల, ఉత్తర భారతదేశంలో ఉద్యమం ఊపందుకోలేదు.

1905-1907లో బెంగాల్ విభజన వ్యతిరేక ఉద్యమాన్ని వలస పాలకులు హింస రక్తపాతంతో క్రూరంగా అణచివేశారు. అందులోంచి ఉద్యమంలో తీవ్రవాద రూపం కూడా కనిపించింది. అరబిందోఘోష్ మున్నగు నాయకులు సాయుధ విప్లవ దళాలను కూడా ఏర్పర్చారు. పంజాబ్, మద్రాస్, బొంబాయి ప్రాంతాల్లో స్వదేశీ ఉద్యమం ప్రజల్లో బ్రిటిషు పాలన పట్ల నిరసనను ఉత్తేజపరిచింది. పంజాబులో స్వదేశీ వ్యాపారులు, బ్యాంకులూ, ఇన్సూరెన్స్ కంపెనీలూ, స్కూళ్లు స్థాపించారు. బ్రిటిషు మిషనరీ విద్యను వ్యతిరేకించారు. ఉద్యమం బాగా విజృంభించింది. 1857ల నాటి తిరుగుబాటు మళ్ళీ వస్తుందేమోనన్న భయంతో, లాలాలజపతిరాయ్‌ని పంజాబు నుంచి బహిష్కరించారు. మద్రాసు ప్రాంతాల్లో బెంగాల్ ఉద్యమానికి దన్నుగా తెలుగు కాంగ్రెస్ నాయకులు నిలబడ్డారు. నిషేధింపబడిన బంకించంద్ర ఛటర్జీ జాతీయ గీతం – వందేమాతరం – పాఠశాలల్లో పాడించారు. తెలుగు మాట్లాడే వారికి ప్రత్యేక రాష్ట్రం కావాలని ఆంధ్ర మహాసభ 1910లో ఆరంభమయింది. బ్రిటిషు కంపెనీకి పోటీగా మద్రాసులో స్వదేశీ స్టీమ్ నేవిగేషన్ కంపెనీని నెలకొల్పారు. 1905లో రష్యా తొలి విప్లవాన్ని కీర్తిస్తూ ఉద్యమకారులు సంబరాలు జరుపుకున్నారు. 1917లో మళ్లీ సుబ్రహ్మణ్య భారతి ఆధ్వర్యంలో సంబరాలు జరుపుకున్నారు.

1909లో అరబిందో ఘోష్ రాజకీయాల నుంచి బయటకు వచ్చేసి పాండిచ్చేరిలో ఆశ్రమాన్ని నెలకొల్పాడు.

స్వదేశీ ఉద్యమ ప్రభావంతో బ్రిటిషు పాలన పట్ల వ్యతిరేకతలేని టాటా కుటుంబం భారతదేశంలో మొదటి స్టీల్‌వర్క్స్ ప్రారంభించారు. వస్త్ర పరిశ్రమలు లాభపడ్డాయి.

మద్యం దుకాణాలు మూసివేయాలని ప్రజలు ఉద్యమించారు. ఆ తరువాత మద్యపాన నిషేధం గాంధీజీ ఉద్యమంలో భాగమయింది. 1907 సూరత్ కాంగ్రెస్ మహాసభలో విదేశీ వస్తు బహిష్కరణ స్వదేశీ వస్తు విక్రయం స్వరాజ్యం భారతీయ విద్య కోసం ప్రజా ఉద్యమం బలోపేతం చెయ్యాలని తీర్మానించారు.

మోర్లీ మింటో సంస్కరణలు Indian council act of 1909 వచ్చింది. వైస్రాయి కార్య నిర్వాహక వర్గంలోనూ గవర్నర్ల కార్య నిర్వాహక వర్గంలోనూ ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్లోనూ ప్రావిన్సియల్ కౌన్సిల్సులోనూ భారతీయులకు కొన్ని షరతులతో ఎన్నికల విధానం ద్వారా చోటు కల్పించారు. 1911లో విభజింపబడిన బెంగాలును మళ్ళీ తిరిగి కలిపేశారు. 1912లో బ్రిటిషు ఇండియా రాజధాని కలకత్తా నుంచి న్యూ ఢిల్లీకి మారింది. మోర్లీమింటో సంస్కరణల చట్టం వల్ల ఒనగూరిన స్వపరిపాలన నిజరూపంలో ఏమీ లేదు. వలస పాలకులపై చేయి కిందే అంతా నడుస్తుంది. అయితే కాంగ్రెస్ నాయకులు కొందరు ఏడ్వలేక నవ్వుకున్నారు.

అమెరికా, కెనడా దేశాలకు వలసపోయిన భారతీయులు అమెరికన్లతో సమానంగా హక్కులు కావాలని లాలాహరదయాళ్ ఐక్య భారతీ సమితి స్థాపించాడు. 1913లో దాని స్థానంలో బాబా సోహన్ సింగ్ భాక్నా 'గదర్' (తిరుగుబాటు) పార్టీని స్థాపించాడు. నార్త్ అమెరికా నుంచి తిరుగుబాటుదార్లు షిప్పులో కలకత్తా చేరుకున్నారు. పోలీసులకు పట్టుబడిపోయారు. కొందర్ని చంపేశారు. 8000 మందిని జైళ్లల్లో కుక్కేశారు.

1914 – 1918లో మొదటి ప్రపంచ యుద్ధం వచ్చింది. భారతదేశం తమ సొంతదేశం అయినట్లు, భారత ప్రజలకూ

నాయకులకూ చెప్పకుండా భారత సైన్యాలను రహస్యంగా యుద్ధరంగంలోకి తరలించి, భారతదేశం యుద్ధంలో ఉన్నట్లు ప్రకటించారు. వివిధ రూపాల్లో భారత ఆర్థిక వ్యవస్థను కుదేలు చేశారు. భారత సైనికులు యుద్ధంలో భారీగా మరణించారు. అయితేయుద్ధం ముగిశాక, బ్రిటిషు ప్రభుత్వం భారతదేశానికి స్వరాజ్యం ప్రకటిస్తారని జాతీయోద్యమ నాయకులు పెద్దగా వ్యతిరేకించలేదు. ఇంకా చెప్పాలంటే సహకరించారు.

యుద్ధంలో బ్రిటిషు సైన్యం, టర్కీలోని Ottaman regime కి వ్యతిరేకంగా యుద్ధం చేసినవాళ్లను అరబ్ ప్రాంతాల నుంచి తరిమివేశారు. దానివల్ల బొంబాయిలోని ప్రముఖ న్యాయవాది మహమ్మద్ ఆలీజిన్నా నాయకత్వం లోని ముస్లింలీగ్ ఆగ్రహించి 1916లో జాతీయ నాయకులతో చేతులు కలిపి బ్రిటిషు పాలన వ్యతిరేక ఉద్యమాల్లో పాల్గొంది.

భారత స్వాతంత్ర్య పోరాటం బలంగా ముందుకు సాగడానికి ఐరిష్ వనిత అన్నీ బిసెంట్ కాంగ్రెస్ నాయకులను కూడ గట్టి Indian home rule league 1916 సెప్టెంబర్ 15న స్థాపించింది. “యుద్ధ కాలంలో భారతీయులు చూపిస్తున్న విధేయతకు ప్రతిఫలం భారతదేశ స్వాతంత్ర్యమే” అని ప్రకటించింది. తిలక్ జిన్నా లాలాలజపతిరాయ్ మున్నగు నాయకులు అందులో పనిచేసి ఉద్యమాన్ని నడిపారు. 1920లో గాంధీజీ దానికి అధ్యక్షుడయ్యాడు. ఆ ఉద్యమ స్థానంలో సహాయ నిరాకరణ ఉద్యమం ప్రారంభించాడు.



The government of India act of 1919 వచ్చింది. బ్రిటిషు ప్రభుత్వం కింద భారత స్వపరిపాలన అన్నారు. దాని ప్రకారం, తక్కువ ప్రాముఖ్యం ఎక్కువ వ్యయం ఉన్న విద్య ఆరోగ్యం వంటి శాఖలు రాష్ట్ర శాసనసభలు ఎన్నుకున్న మంత్రులకు అప్పగిస్తారు. మంత్రుల సలహాలను తిరస్కరించే హక్కు గవర్నర్లకు ఉంటుంది. ఆర్థిక, సైనిక, సాధారణ పరిపాలనా మున్నగు ముఖ్యమైన శాఖలు వైస్రాయి కార్యనిర్వాహక వర్గం చేతుల్లో ఉంటాయి. కార్య నిర్వాహక వర్గ సభ్యులు కేంద్ర ప్రభుత్వానికి, బ్రిటిషు పార్లమెంటుకూ బాధ్యులుగా ఉంటారు. ఇందులో వలస పాలకుల స్వార్థ పూరిత లక్ష్యాలను ముఖ్యంగా రెండింటిని చరిత్రకారులు గుర్తించారు. ఒకటోది విద్య, ఆరోగ్యం వంటి రంగాల్లోని వ్యయాన్ని భారతీయుల బుర్ర మీద రుద్దేశారు. రెండో బ్రిటిషు ప్రభుత్వంతో చేతులు కలిపి పనిచేసే భారత స్వపరిపాలన ద్వారా సానుకూల పవనాలు సృష్టించి, బ్రిటిషు ప్రభుత్వం కింద బ్రిటిషు ప్రభుత్వాన్ని బలోపేతం స్థిరం చేసుకోవచ్చు నన్న వ్యూహం.

మొదటి ప్రపంచ యుద్ధం తరువాత బ్రిటిషు ప్రభుత్వం భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రకటిస్తుందని ఆశించారు. అయితే యుద్ధం పూర్తిగా ముగియక ముందే, చాలా గొప్ప బహుమతిని ప్రకటించింది. సివిలు హక్కులు కాలరాచే 1917 Rowlatt చట్టాలు ! ఆ చట్టాన్ని నిరసిస్తూ పంజాబులోని అమృతసర్‌లో 1919లో శాంతియుత ప్రదర్శన జరిగింది. General dyer 379 ప్రదర్శన కారులను చంపించాడు. 1200 మంది గాయపడ్డారు. బ్రిటిషు ప్రభుత్వం అతని అమానుష రక్తపాతాన్ని సమర్థించింది. అయినప్పటికీ, గాంధీజీ అహింసా ఉద్యమాన్నే బలపర్చాడు. ఇప్పటికి ఇక్కడ ఆగిపోదాం. ముందు చెప్పుకున్న చరిత్ర నుంచి కొద్దిపాటి చారిత్రక వాస్తవాలను గుర్తించి మాట్లాడుకుందాం. 1) భారత సైనికుల్లో విధి నిర్వహణ పట్ల ఉన్న వినయ విధేయతలు క్రమ శిక్షణ జాతి గర్వించదగినవి. వాటివల్ల ఉద్యమ కాలంలో భారతీయులకు అపారనష్టం పలు విధాలుగా కలిగినా, స్వాతంత్ర్యం తరువాత అవి జాతి గర్వించ దగ్గ ఉన్నత లక్షణాలే. 2) సంస్థానాధిపతులు పెట్టుబడి దారీవర్గం కొద్దిపాటి మినహాయింపులతో వారిసొంత అభివృద్ధే లక్ష్యంగా పనిచేశారు. దేశంకోసం ప్రజలకోసం పట్టించుకోలేదు. 3) మధ్య తరగతి మేధా వర్గం - శ్రామిక వర్గం గొప్పత్యాగాలు చేసి ఉద్యమాన్ని నడిపారు. నిజానికి మన దేశంలోని అన్ని ఉద్యమాలూ నక్సలైట్ ఉద్యమంలో సహా మధ్య తరగతి మేధావర్గం చేతుల్లోనే ఆవిర్భవించాయి. 4) మతం - కులం - ప్రాంతం వంటివి నిరాధారమైన విశ్వాసాల్లోంచి ఆవిర్భవించిన మానవ బలహీనతలు. వాటిని ప్రజల్లో రెచ్చగొట్టడం చాలా తేలిక. బ్రిటిషు సామ్రాజ్యవాదం ఆ పనే చేసి విభజించు పాలించు సిద్ధాంతాన్ని అమలు జరిపింది. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత కూడా, మన దోపిడీ రాజకీయ వ్యవస్థ ఎవరి స్వార్థ ప్రయోజనాల్లో వాళ్లు ఆపనే చేస్తున్నారు. 5) ప్రజలందరికీ సమానంగా ఉపయోగపడే మహోన్నత లక్ష్యం గొప్ప నిర్మాణం గొప్ప వ్యూహం వంటి ఉన్నతమైన నిర్మాణ అంశాలున్నప్పుడే ఆ ప్రజా ఉద్యమాలు విజయవంతమౌతాయి. ఆ విధంగా రూపుదిద్దుకోని ప్రజా ఉద్యమాలు అణచివేతలో రక్తపాతంలో ముగిసిపోయాయి. 6) 1857 నుంచి 1919 వరకూ లక్షలాది మంది ప్రజల త్యాగాలూ రక్తపాతం సాధించింది చాలా తక్కువ Indian councils Act of 1861, 1909, 1919 వల్ల బ్రిటిషు ప్రభుత్వ ఆధిపత్యం కింద భారత స్వపరిపాలనకు నిజానికి చాలా చిన్నచోటు మాత్రమే దొరికింది. 7. ఆనాటి బ్రిటిషు పాలకులు అధికార్లు సైనికులు సృష్టించిన రక్తపాతం హింసవల్ల, చేసిన దురాక్రమణ విద్రోహం దోపిడి వల్ల, జాత్యహంకారంతో సృష్టించిన బానిసత్వం వల్ల ఆ విధంగా పెక్కు అమానుష చర్యలవల్ల మానవులుగా పిలవబడే అర్హత కోల్పోయారని చరిత్ర స్పష్టంచేస్తుంది.

**చరిత్ర సమాజం రెండు కళ్లు. చరిత్ర కన్ను పూర్తిగా విప్పి చూడకపోతే, సమాజం కంటిచూపు మందగిస్తుంది.**

**రచయిత సెల్ : 0891-2557961**

## రైలు కబేళా

చిన్ని నారాయణ

రైలుగంట కొట్టగానే
బడిగంటేదో మోగినట్లు
సంచీ సర్దుకొని
స్కూలుకెళ్ళే పసివాడులా
ప్లాట్‌ఫారంపైకి ప్రత్యక్షమయ్యే
క్రమశిక్షణకు ప్రతిరూపం అతడు
గజేంద్రుని పాలిట విష్ణువై
ప్రయాణీకులు పిలిస్తే పలికే
ఆపద్బాంధవుడతడు
తామంతా చీమల బారులయి
ఐక్యమత్యాన్ని చాటుతూ
ప్లాట్‌ఫారాన్ని తమదైన శైలిలో
ఆలింగనం చేసుకొని
మేమున్నామంటూ –
భరోసా అందించే సైనికులు వాళ్ళు.
వృద్ధులకు క్షణంలో చేతికర్రలవుతారు
తమ బ్రతుకు బండిని మాత్రం నడపలేని
ఆ జనం... ట్రాలీని చాకచక్యంగా గట్టెక్కిస్తారు
రైళ్ళే వీళ్ళను చూసి సంతృప్తిని పులుముకొంటాయి
బ్రేకుల శబ్దంతో హర్షధ్వానాలు చేస్తాయి
వీళ్ళిచ్చే చేయూతతోనే కదా
అల చెలియలి కట్టకు చేరినట్లు
ప్రయాణీకుడు గమ్యానికి చేరేది.



హనుమంతుడు సంజీవనీ పర్వతాన్ని
మోసుకొస్తున్నంత విధేయతతో
నిబద్ధతను ప్రదర్శించే
జీతాలులేని జీవితాలు వాళ్ళవి
ఆ సంజీవని శ్రీరామునికోసమైతే
వీళ్ళు మోసుకొచ్చే సంజీవని
ప్యాసింజర్లకు కల్పతరువవుతుంది
ఎన్నాళ్ళదో... ఎన్నేళ్ళదో
ఆ అడుగుల సవ్వడి... ఆ వడి
ఆనడవడి ! అవనిలా బాధ్యతా
బరువులు మోస్తున్న
బ్రతుకుల్లో భూకంపం... ధడేల్‌మని
పెళ్‌పెళ్‌మంటూ ఆకాశంలో
ఉరిమినట్లు బ్రతుకుల్లో అలజడి
చేయని తప్పుకు కబేళాకు
తరలింపబడే గోమాతలైన దీనులు
రైళ్ళే తమ ఆవాసాలుగా... నివాసాలుగా
భావించే ఆ ఎర్రజనం... వెర్రిజనం
కేరాఫ్ ఒక ప్లాట్‌ఫారమే కాబోతున్నది.
ఆ కళ్ళల్లో ఎర్రజీర... రక్తాశ్రువులు శ్రవిస్తున్నాయ్
వాళ్ళిప్పుడు అభినవ భీములై ప్రభుత్వ
బకాసురులపై యుద్ధానికి సర్వసన్నద్ధమవుతున్నారు.

**(పోర్టరు వ్యవస్థను రద్దు చేయాలన్న వార్తను చదివి)**

---

## ప్రశ్నంటే? ?

శ్రీనాగాస్త్ర

✆ : 9640317108



ఓ ధిక్కార స్వరం
ఓ జ్ఞాన చక్షువు
ప్రశ్నించడమంటే ?
విజ్ఞానాన్ని తవ్వి తీయడం
అజ్ఞానాన్ని పాతేయడం
ప్రశ్నించడమంటే ?
సత్యానికి దన్నుగా నిలబడటం
అన్యాయాన్నెదిరించి పోరాడటం
ప్రశ్నించడమంటే ?
బానిసత్వ సంకెళ్ళను పటపటాత్రెంచడం
మందుగుండును రాతిబండలో పెట్టి పేల్చడం

ప్రశ్నించడమంటే ?
మూగ గొంతులో ఫిరంగి గర్జించడం
ఆత్మాభిమానం తలెత్తి మీసం మెలేయ్యడం
ప్రశ్నించడమంటే ?
మూడో కన్నును భళ్ళున తెరవడం
ఛెర్నాకోలాను ఛెళ్ళున విసరడం
ప్రశ్నంటే ?
భూగోళం పై
కొడవలి జెండాను ఎగరేయటం

కథ

# ఆశాజీవి

జి. గోపాలకృష్ణ మూర్తి
08922-231605



"సీతా! నాన్నగారికి క్షేమంగా వెళ్ళి వస్తాను అని చెప్పవే!" సుమతి కూతురుతో అంది.

కూతురు సీతను అల్లుడు దగ్గరికి దిగబెట్టి వస్తానని సుమతి బయలుదేరింది. పుట్టింటికి వచ్చిన సీత తనున్న వారం పదిరోజులూ తండ్రితో మాటామంతీ లేకుండా ఎడమొగం – పెడమొగంతో ఉంది. తల్లి చెప్పిన మీదట కూతురు తండ్రితో ముక్తసరిగా "వెళ్తాను" అంది.

"వెళ్తాను అని చెప్పకూడదు. వెళ్ళివస్తాను" అనాలి. సుమతి కూతురుతో అంది.

"ఆఁచాల్లే! వెళ్ళి వస్తాను అని చెప్పేటంత గొప్పగా ఉందా నా జీవితం?"

కూతురు మాటల్లో కృష్ణమూర్తికి తిరస్కారభావం అగుపించింది జవాబుగా ఊఁ......! అన్నాడు కూతురుతో వెళ్ళమన్నట్టు.

బస్సు బయలుదేరింది. బస్సు కనుమరుగయ్యే వరకూ అలా చూస్తున్న అతని కళ్ళల్లో సన్నటి నీటి తెర. గుండెల్లో చెప్పనలవి కానంత బాధ.

ఒక్కసారి నిస్సత్తువ అతడ్ని ఆవరించింది. అడుగులు ముందుకు వేయలేనంతగా నీరసపడిపోయిన ఆయన కాంప్లెక్సుకి దూరంగా ఉన్న చెట్టు నీడన కూర్చున్నాడు. తనకి కూతురంటే ఎంత ఆపేక్ష ఎంత అభిమానం? కూతురికి కూడా తనంటే అంతే అభిమానం. కూతురు మీద భావ మనో విజ్ఞాన శాస్త్రం ప్రకారం శ్రద్ధ ఉన్న దగ్గర భక్తి ఉంటుంది. ఆశ్రద్ధా భక్తుల్తో ప్రేమ వచ్చి కలుస్తుంది. గంగా, యమునా, సరస్వతీ నదుల సంగమంలా.

అలాంటి మానవ సంబంధాలు ఈ సమాజంలో తన విషయంలో ఇలా తెగిపోవడం అంతులేని చెప్పనలవి కానంత బాధను కలిగిస్తోంది. ఆత్మ విమర్శ చేసుకుంటున్నాడాయన.

తను చేసిన తప్పేంటి? కూతురికి పెళ్ళి చేయటమా? అది తప్పు ఎలా అవుతుంది? తండ్రిగా అది తన బాధ్యత కాదా? అయితే నాణేనికి ఒకవేపే చూస్తున్నాడు తను.? రేండో వైపు నుంచి కూడా చూస్తే తను చేసింది తప్పే. కూతురికి పెళ్ళి చేస్తున్నప్పుడు అబ్బాయి నే కాదు అబ్బాయి కుటుంబ పరిస్థితులు క్షుణ్ణంగా తెలుసుకోవాలి. పరిశీలించాలి. ఎవరో చెప్పిన వాళ్ళ మాట నమ్మి కూతురు పెళ్ళి చేసేయడం కాదు.

కూతురు జీవితం ఇలా తయారవడానికి ముమ్మాటికి తనే కారణం, కూతుర్ని పులి నోరు లాంటి అత్తవారింట్లో పడేసేడు. సీత పేరుకు తగ్గట్టు సీతే. త్రేతాయుగంలో ఆ సీత పడ్డ కష్టాలే. ఈ కలికాలంలో తన కూతురు అనుభవిస్తోంది.

తన కూతురు భవిష్యత్తు ఊహించే తను కూతురికి ఆపేరు పెట్టి ఉంటాడు. ఈ కాలంలో పాతిక సంవత్సరాలు వచ్చినా ఆడపిల్లలు పెళ్ళి చేసుకోవటం లేదు. తమ కాళ్ళ మీద తాము నిలబడగలం అన్న ఆత్మ విశ్వాసం కలిగిన తరువాతే పెళ్ళి చేసుకుంటున్నారు. అయితే తను తన బాధ్యత వదిలించుకోవాలని చూసేడేకాని కూతురు భవిష్యత్తు గురించి ఆలోచించలేదు. సీత డిగ్రీ పాసయిన వెంటనే ఇరవై ఏళ్ళకే తొందరపడి పెళ్ళి చేశాడు తను.



సీత పెళ్ళికాక ముందు ఎంత ఉషారుగా ఉండేది? ఎంత చలాకిగా తిరిగేది? కారణం ఉన్నా, లేకపోయినా తనతో ఊరికే తగవు పెట్టుకుని, తరువాత ఇలాంటి పోట్లాటలు లేకపోతే థ్రిల్ ఏంటి అనేది తనతో.

మనం పిల్లల్ని అయితే కంటాం కాని వాళ్ళ నుదుట వ్రాతల్ని వ్రాయలేం అంటారు వేదాంత ధోరణితో కొందరు. వాళ్ళు చెప్పింది నిజమేనేమో అని అనిపిస్తుంది. మనకి ఒకొక్క సమయంలో. ఎవరికి ఎలా రాసి పెట్టి ఉందో వేదాంత ధోరణిలో ఆలోచించడం తప్ప మనం ఏం చేయగలం? ఆ కంటికి కనిపించని దేవుడు మీద భారం వేయడమే.

జరిగిపోయిన సంఘటనలు అతని కళ్ళెదుట కదులుతున్నాయి. స్టాఫ్‌రూమ్‌లో కూర్చుని పరిక్ష పేపర్లు దిద్దుకుంటున్నాడు కృష్ణమూర్తి.

"మాష్టారు! మీ అమ్మాయి సీతకు నాకు తెల్సిన వాళ్ళ అబ్బాయి పెళ్ళి కొడుకు ఉన్నాడు. మీ అమ్మాయికి తగిన అబ్బాయి. మీకు ఇష్టమయితే ప్రొసీడవ్వండి. అబ్బాయి చాలా యోగ్యుడు, బుద్ధిమంతుడు అని అంటూ రమణయ్య మాష్టారు ఆ అబ్బాయి గురించి వాళ్ళ కుటుంబం గురించి వివరాలు చెప్పారు.

ఈ రోజుల్లో సమాజంలో ఆడపిల్లల సంఖ్య తగ్గిపోయింది భ్రూణహత్యల వల్ల. ఇప్పుడు అమ్మాయిలకి గిరాకీ పెరిగిపోయింది. అమ్మాయిల విషయం కాదు. వస్తువుల విషయంలో కూడా తక్కువ సప్లయివున్న వస్తువు డిమాండ్ ఎక్కువుగా ఉంటుంది.

అలాగే అమ్మాయిల సంఖ్య తగ్గినప్పుడు సహజంగా వాళ్ళ డిమాండ్ ఎక్కువగానే ఉంటుంది. ఇప్పుడు అబ్బాయి తరుపువాళ్ళే అమ్మాయిల ఇంటి ముందు క్యూ కడ్తున్నారు. లేకపోతే మేరేజ్ బ్యూరోలను ఆశ్రయిస్తున్నారు. ఈ మేరేజ్ బ్యూరోలు వివాహ పరిచయ వేదికలు ఊరూరా ఏర్పాటు చేస్తే అమ్మాయి అబ్బాయిల తల్లిదండ్రులు ఆ పరిచయ వేదికలకి వెళ్ళి తమకు నచ్చిన వాళ్ళకు తమకు అనుకూలమైన సంబంధాన్ని కుదుర్చుకుంటున్నారు.

కాలంతో పాటే సమాజ పోకడలు కూడా మారాయి. అతను పూర్వం అయితే అబ్బాయిలు వాళ్ళ తరుపు వాళ్ళు అమ్మాయిల్ని శల్య పరీక్షకి గురిచేస్తే ఇప్పుడు పెళ్ళి కొడుకుల్ని శల్య పరీక్షకి గురిచేస్తున్నారు.

సాంప్రదాయాలకి – కట్టుబాట్లకి విలువిచ్చే సీత మాత్రం అబ్బాయిల్ని శల్య పరీక్షకి గురిచేసే ఆడపిల్లకాదు. శల్య పరిక్షకి గురిచేస్తున్న అమ్మాయిలు సంప్రదాయ కుటుంబంలోని వారు కాదా అని ప్రశ్నించుకుంటే అదేంలేదు". అని సమాధానం వస్తుంది. అయితే సీత మాత్రం ఇప్పటి కాలం పిల్లల్లా గడుసు పిల్ల కాదు. మాట నేర్పులేదు. లౌక్యం తెలియదు.

మీరు చెప్పింది బాగానే ఉంది కాని వాళ్ళు ఎవరో ఎటువంటి వాళ్ళో వాకబు చేయాలి కదా! తను అన్నాడు రమణయ్య మాష్టారితో.

అబ్బాయి తరుపు వాళ్ళు చాలా మంచి వాళ్ళు. నేను మీకు భరోసా ఇస్తున్నాను. మీరు సందేహించే అవసరం లేదు." అన్నాడు రమణయ్య మాష్టారు.

"తప్పకుండా వాకబు చేయండి ఎందుకంటే ఇది జీవిత సమస్య మనం వస్తువుని కొన్నప్పుడే వస్తువు నాణ్యత మంచి చెడ్డలు మన్నిక చూసి కొంటాం పెళ్ళి జీవితంలో చాలా విలువైన ముఖ్యమైన ఘట్టం. అమ్మాయి సుఖ సంతోషాలకి సంబంధించింది. పెళ్ళి విషయంలో బాగా ఆలోచించి నిర్ణయం తీసుకుంటే కాని చేయకూడదు. తొందరగా నిర్ణయాలు కూడా తీసుకోకూడదు." అన్నారు మాష్టారు తిరిగి.

అబ్బాయి వివరాలు తెలుసుకున్న తను. "ఆ మీరు చెప్పిన సంబంధం అయితే మాకు తెల్సిన వాళ్ళే. దూరపు చుట్టరికం కూడా ఉంది". అన్నాడు తను మాష్టారితో.

ఎంత తెల్సిన వాళ్ళయినా వాళ్ళ గురించి పూర్తిగా తెలుసుకుంటే కాని ముందుకు అడుగు వేయకూడదు. ఎందుకంటే అందరూ పైకి మంచి వాళ్ళలాగే కనపడ్తారు. ఆ తరువాత వాళ్ళ నిజస్వరూపాలు తెలుస్తాయి. నిజమే పెళ్ళి అనేది నిండు నూరేళ్ళ జీవిత సమస్య. ఒకసారి తప్పటడుగు వేస్తే జీవితాంతం దాని ఫలితం అనుభవించవల్సి వస్తుంది. ఇలా మనస్సులో అనుకున్నాడు తను.

సీతను ఇన్ని సంవత్సరాలు తను అపురూపంగా చూసుకున్నాడు. ఎంతో ప్రేమగా చూసుకుంటూ ఆప్యాయతానురాగాలు పంచి పెంచాడు. ఇంత వరకూ కూతురికి ఏ కష్టం రానీయలేదు. సీతకు మనస్తాపానికి గురిచేసే పని ఇప్పటి వరకూ ఏది జరగలేదు. అనుకున్నాడు తను.

"మీరు అనుకున్నటే బాగా ఆలోచించి ఏ నిర్ణయానికైనా రండి." తన ఆలోచన్లు కనిపెట్టిన మాష్టారు అన్నారు. అంతటితో ఆ ప్రసంగం

ముగిసింది.

స్కూల్లో తనకి రమణయ్య మాస్టారికి జరిగిన సంభాషణ ఇంటికి వచ్చాక భార్య సుమతితో చెప్పాడు తను.



"తొందరపడకండి ఏ పనైనా నిదానంగా ఆలోచించి చేయాలి" సుమతి అంది.

"నేను చదువుకుంటాను, ఇప్పుడప్పుడే నాకు పెళ్ళి వద్దు" అంది సీత.

"చాలా మంచి సంబంధం. పిల్లాడు చాలా బుద్ధిమంతుడు. యోగ్యుడు" అని సీతకి నచ్చజెప్పి, ఆమెను ఒప్పించే ప్రయత్నంలో ఉన్న తను చివరికి తన ప్రయత్నంలో సఫలీకృతమయ్యాడు.

పెళ్ళి చూపులప్పుడు అబ్బాయి తరుపువాళ్ళు "మా ఇంటికి కోడలుగా వచ్చినమ్మాయి చాలా సుఖపడ్తుంది మాకు కూతురు – కోడలూ ఒకటే అని అబ్బాయి తల్లి "మావాళ్ళకి కూతుళ్ళ కంటే కోడలే ఎక్కువ అని ఆ ఇంటి ఆడపిల్లలూ అనేసరికి పొంగిపోయాడు తను.

పెళ్ళికొడుకు కూడా బాగున్నారు. మంచి వాడిలా అగుపడ్తున్నాడు అనుకున్నాడు తన మనస్సులో. పెళ్ళిచూపులు తతంగం పూర్తయ్యాక మగపెళ్ళి వారి గురించి తెల్సిన వాళ్ళు "మంచి సంబంధం చాలా మంచి వాళ్ళు" ఈ సంబంధం చేసుకోవచ్చు. అని చెప్పేసరికి తనకి కొంత ధైర్యం వచ్చింది. ఆ తరువాత తను సంబంధం నిశ్చయం చేశాడు.

సీత చాలా చక్కగా ఉంటుంది. ఎంచడానికి ఏ లోపం లేనిపిల్ల చాలా అణుకువ గల పిల్ల అందుకే కట్న కానుకల దగ్గర పెద్ద పేచీలు లేకుండా మగపెళ్ళి వారు ఒప్పుకోడం వల్ల నిశ్చితార్థం జరగడం వెనువెంటనే పెళ్ళి కూడా జరిగిపోయింది.

పెళ్ళిలో ఏ గొడవలూ జరగలేదు. తమ వల్ల ఎటువంటి పొరపాట్లు జరిగినా పెద్ద మనస్సుతో మగ పెళ్ళివారు సర్దుకుపోవడం చూసి కూతురుకి మంచి అత్తగారే వచ్చారు అని అనుకుని తను పొంగిపోయాడు.

ఆ సంతోషం ఎన్ని రోజులో నిలవలేదు. తనకి ఆషాడమాసంలో ఇంటికి వచ్చిన కూతుర్ని చూడగానే అవాక్కుఅయ్యాడు తను. సుమతి చాలా బాధపడింది. తమ కూతురేనా అని అనిపించింది సీతను చూసిన తరువాత.

కూతురు చాలా నీరసంగా ఉంది. కళ్ళలో ప్రాణాలున్నట్లుంది. చాలా బలహీనంగా ఉంది. పెళ్ళికి ముందున్న రూపమే లేదు. పెళ్ళయిన మూడు నెలలకే ఆషాడ మాసం రావడం సీత పుట్టింటికి రావడం జరిగింది.

ఎన్నిసార్లు ఫోను చేసినా "బాగానే ఉన్నాను" అని అనేది కాని అక్కడ విషయాలేవీ తెలియజేసేది కాదు. ఆ రూపుకి నీరసానికి తోడు గర్భవతి కూడా అని తెల్సిన నాడు సంతోషించే బదులు మరింత మనస్తాపానికి గురయ్యారు తను, సుమతి.

ఆ రోజు రాత్రి సుమతి తరచి తరచి అడగ్గా తల్లి ఒడిలో తల పెట్టుకుని బోరున ఏడ్చింది సీత. సుమతి ఈ హఠాత్తు పరిణామానికి గాబరా పడింది. అత్తవారింట్లో కూతురి పరిస్థితి ఏం బాగులేదన్న విషయం తనకి సుమతికి అవగతమయింది.

అత్తింటి ఆరళ్ళకి అలవాటు లేని అలాంటివి ఇంతవరకూ చూడని సీత ఇలా బెంబేలెత్తిపోవడం సహజం. ఎందుకంటే అలాంటివి తను పుట్టి పెరిగిన కుటుంబంలో లేవు.

కూతురు ద్వారా తెల్సిన విషయాలు వింటూ ఉంటే తనకి ఒక ప్రక్క బాధ మరో ప్రక్క వియ్యాల వారి మీద మిక్కిలి కోపం వచ్చాయి. ఎంతయినా తను ఆడపిల్లని ఇచ్చుకున్న తండ్రి అందుకే ఎంత కోపం వచ్చినా తమాయించుకున్నారు.

తనకీ ముగ్గురు అక్కయ్యలున్నారు. వాళ్ళు మరదలు సుమతిని ఎంతో అపురూపంగా చూసుకునేవారు. ఇంకా ఏదైనా పొరపాటు తనవల్ల జరుగుతే తననే మందలించేవారు.

తన అత్తవారింటిలో కూడా బావమర్దికి ముగ్గురు అక్కలు సుమతీ వాళ్ళు మరదల మీద ఎప్పుడూ అజమాయిషీ చేయలేదు. తమ్ముడి కుటుంబ విషయాల్లో జోక్యంచేసుకోలేదు. కాని తన కూతురి అత్తవారింటి పరిస్థితి వేరేగా ఉంది.

సీత అత్తవారింట్లో మగవాళ్ళ మాటకి విలువలేదు. ఆడవాళ్ళ డామినేషను ఎక్కువ. ఆ ఇంటి ఆడవాళ్ళది శాడిజం మనస్తత్వం అని ఆ తరువాత తెల్సింది.

ఆ ఇంటి అల్లుళ్ళు వాళ్ళ వాళ్ళని వదిలి అత్తవారి ఇంటి చుట్టూరా తిరగాలి. కోడలు కూడా తన పుట్టింటి వాళ్ళను మరచిపోయి వాళ్ళ భజన చేస్తూ వాళ్ళ చుట్టూ తిరగాలి. కోడలు పుట్టింటికి వెళ్ళకూడదు. పుట్టింటిని మరచిపోయి అత్తవారి దగ్గరే పడి ఉండాలి.

ఇంకా కొడుకూ కోడలూ రాత్రి తప్పితే పగలంతా ఒకళ్ళకి మరొకరు తెలియనట్లు వాళ్ళ ఎదురుగా మసలుకోవాలి. కొడుకూ కోడలూ సరదాగా ఉండకూడదు. మాట్లాడుకోకూడదు. నవ్వుతూ కనిపించకూడదు.

వియ్యాల వారింట్లో పనిమనిషి లేదు. గిన్నెలు కడగడం బట్టలు ఉతకటం. ఇల్లు తుడవటం అన్నీ సీతే చేసేది. అసలే గర్భవతి నీరసంగా

ఉంది. అయినా కనికరం లేదు. అత్తవారికి. తను సీతను చిన్నప్పటి నుండి ఎంత అపురూపంగా పెంచాడు. చివరికి కూతురి పరిస్థితి ఇలా తయారుకావడం తను తట్టుకోలేకపోతున్నాడు. తనకి తానే మాటి మాటికి నిందిచుకుంటున్నాడు. కూతురి పరిస్థితి ఇలా తయారవడానికి తనే కారకుడు.



పెద్ద వాళ్ళకి ఎదురు చెప్పలేక అల్లుడు కూడా మౌనంగా ఊరుకునేవాడట. భర్త సపోర్టు కూడా సీతకి లేదు. భర్త సపోర్టు ఉంటే ఏ భార్య అయినా ఎన్ని కష్టాలు వచ్చినా సర్దుకుపోగలదు. ఎన్ని బాధల్ని అయినా భరించగలదు. కాని ఆ సపోర్టు లేకపోతే చాలా కష్టం.

కూతురి పరిస్థితికి చాలా కలత చెందాడు తను. ఈ రోజుల్లో కొన్ని కుటుంబాల్లో ఆడపిల్లలు ఎంత ధైర్యంగా చలాకీగా ఉన్నారు. పెళ్ళయిన మర్నాడే చెట్టాపట్టాలేసుకుని భర్తల్ని వెనక త్రిప్పుకుంటూ హనీమూన్‌కి వెళ్తూ ఉంటే అలాంటి వాళ్ళతో సీత జీవితాన్ని సరి పోల్చుకుంటే మనస్సులో మిగిలేది వ్యథ మాత్రమే. కూతురిది సుఖ సంతోషాలు లేని జీవితం అయిపోయిందని తను కుమిలిపోయాడు.

"మంచి వాళ్ళు అనుకున్నాం కాని ఇలాంటి వాళ్ళు అని అనుకోలేదు" అన్నారు బంధువులు.

ఎన్నడు తనకి ఎదురు చెప్పని కూతురు "నేను చదువుకుంటాను. నాకు ఇప్పుడప్పుడే పెళ్ళి వద్దంటే నా మాట విన్నారు కాదు. నా జీవితం నాశనం చేశారు. మీరంటే నాకు ఇప్పుడు గౌరవం పోయింది మీ మీద. మీరంటే నాకు ఎలర్జీ అంటూ సీత ఏడుస్తూ ఉంటే తన గుండెల్ని కూతురి మాటలు పిండి చేశాయి.

తనంటే కూతురికి ఎంత అభిమానం. అంతగా అభిమానించిన కూతురు ఇలా మాట్లాడుతూ ఉంటే తను తట్టుకోలేకపోయాడు. పరిస్థితుల ప్రభావం వల్ల నా మీదున్న అభిమానం ద్వేషంగా మారిపోయింది. తండ్రిగా పరిస్థితుల్ని చక్కదిద్దకపోతే బంధాలు తెగిపోతాయి. అటు అత్త వారింటిలో పరిస్థితులు సక్రమంగా లేనప్పుడు పుట్టింటితో అదే కన్న తల్లిదండ్రుల్తో వైరం పెంచుకుంటే నష్టపోయేది కూతురు జీవితమే. అలా జరగనీయకూడదు. ఇలా ఆలోచిస్తున్న తనకి బాధ ఒక ప్రక్క దుఃఖం మరో ప్రక్క ఒక్కసారి ఉబికి వస్తున్నాయి.

"చాలా మంచి వాళ్ళని ఈ సంబంధం చేశారు. ఇప్పుడేమయింది. మీరే మీ అమ్మాయి జీవితం నాశనం చేశారు" అంటూ సమయం దొరికనప్పుడల్లా సుమతి మాటల్తో హింసిస్తూ ఉంటే తను మరింత మనస్తాపానికి గురిఅయ్యేవాడు.

విపరీతమైన టెన్షన్‌తో సుమతి డిప్రెషనులోకి వెళ్తుందేమో అని తను భయపడేవాడు. ఎందుకంటే సుమతి మరీ సెన్సిటివ్. చిన్న బాధకే తట్టుకోలేదు. అయితే సుమతి ఆ సమయంలో తనకన్నా చాలా ధైర్యంగా ఉంది.

అన్ని సమస్యలకీ ఓ పరిష్కారం ఉంటుందంటారు. ఈ సమస్యకీ పరిష్కారం కాలమే సూచిస్తుంది. మీరు మరింత దిగులు పడకండి జరగవల్సింది జరిగిపోయింది. ఇప్పుడు ఎవరికి చెప్పుకున్నా లాభం ఏంటి? చెప్పుకున్నా సానుభూతి చూపిస్తారు. ఇప్పుడు మనకికావల్సింది ఆ సానుభూతా? ఆ సానుభూతి మనకక్కర్లేదు. మన సమస్యని మనమే పరిష్కరించుకోవాలి"

అలా అన్న సుమతి మాటలు తనకి కురుక్షేత్రం మైదానంలో అర్జునికి గీతోపదేశం చేస్తున్న కృష్ణ భగవాని గీతోపదేశంలా అనిపించింది.

"నిజమే! సుమతి చెప్పినట్టు ప్రతీ సమస్యకి ఓ పరిష్కారం ఉంటుంది. కాలంతోపాటే ఆ సమస్యకి పరిష్కారం దొరుకుతుంది. తప్పకుండా ఆ మార్పు కోసం ఎదురుచూడ్డం తప్ప మనమేం చేయలేము. అయితే ప్రస్తుతం తను కూతుర్ని మాత్రం బలిపశువుని చేశాడు.

కాలం గడిచిన కొద్దీ అల్లుడులోను వియ్యాలవారి లోనూ మార్పు వస్తుంది. అత్తవారికి కూడా కూతురు విలువ తెలుస్తుంది. సీత పరిస్థితి చక్కబడ్తుంది. తను ఆశాజీవి. అవడం వల్ల అలా ఆలోచిస్తున్నాడు. అలా అని తను చేతులు ముడుచుకుని కూర్చోడు.

కూతురి పెళ్ళి విషయంలో తనవల్ల జరిగిన పొరపాటు తను పరిష్కారించాలి. పరిష్కరించడానికి తను మెత్తగా ఉండకూడదు. తనూ ఎదిరించి మాట్లాడాలి. అలా అని తగువు పెట్టుకోమని కాదు.

అలా చేస్తే పరిస్థితి చక్కబడడానికి బదులు మొదటికే నాశనం అవుతుంది. వియ్యాలవారికి తను తప్పును తెలియచేయాలి. విడమర్చి చెప్పాలి. అవగాహన కల్పించాలి.

అత్తవారిలో మార్పు వస్తే కూతురుజీవితం సంతోషకరంగా మారుతుంది. క్రమంగా కూతురు తన మీద ఏర్పరుచుకున్న ద్వేషం పోతుంది. అప్పుడు పెళ్ళి కాకముందు సీత ఎలా ఉండేదో అలా మళ్ళీ మారుతుంది. మానవ సంబంధాలు మెరుగుపడ్తాయి.

అటువంటి రోజుకోసం శశాంకుని వెన్నెల కోసం ఎదురు చూస్తున్న చకోరంలా తను ఎదురుచూస్తాడు. ఆశాజీవిగా జీవిస్తాడు. అంత వరకూ తప్పదు ఈ బాధ. ఆడపిల్లల్ని కన్న కొంతమంది తండ్రుల్లో తనూ ఓ దురదృష్టవంతుడైన తండ్రి అనుకుంటూ కృష్ణమూర్తి ఆవేదన వల్ల పై కుబికిన కన్నీటిని రుమాల్తో వత్తుకుంటూ ఇంటి వైపు అడుగులు వేశాడు. ●

2012 నోబెల్ సాహిత్య బహుమతి విజేతతో

# సంభాషణ- విశ్లేషణ

ఎస్.ఎస్.బి. గేరా



మో యాన్

ఈ సంవత్సరం నోబెల్ సాహిత్య బహుమతి చైనా జాతీయుడైన మో యాన్ అనే చైనా రచయితకు దక్కింది. అతని జీవిత విశేషాల్ని, రచనా విశేషాల్ని క్లుప్తంగా వివరిస్తూ ఆయనతో బహుమతి ప్రకటన వెంటనే జరిపిన ఇంటర్వ్యూను ఉటంకిస్తూ, విశ్లేషించే ప్రయత్నంచేద్దాం.

**జీవిత విశేషాలు :** మో యాన్ అసలు పేరు గువాన్ మోయి. మో యాన్ అతని కలం. ఇతను ఫిబ్రవరి 17, 1955లో జన్మించాడు. బాల్యం చాలావరకు తూర్పు చైనాలోని షాండాంగ్ ప్రావిన్స్‌లో గడిచింది. సాంస్కృతిక విప్లవం ప్రభావం వల్ల మో తన 12వ ఏటనే బడి మానేసి, సైన్యంలో చేరాడు. తరువాత ఓ పెట్రోలియం ఫ్యాక్టరీలో పనిచేశాడు. చివరికి పి.ఎల్.ఎ. అకాడమీ ఆఫ్ ఆర్ట్స్ అండ్ కల్చర్‌లోని డిపార్ట్‌మెంట్ ఆఫ్ లిటరేచర్‌లో బోధనా వృత్తిలో స్థిరపడ్డాడు.

**రచనా విశేషాలు :** మో సైనికుడుగా ఉన్నప్పటి నుంచే రచనలు చేయడం ప్రారంభించాడు. మొదట్లో విరివిగా కథానికలు రాసినా, నవలికలు, నవలలు రాయడం మొదలుపెట్టాడు. ఇతని మొదటి నవల ఫాలింగ్ రెయిన్ ఆన్ ఎ స్ప్రింగ్ నైట్ 1981లో వెలుగు చూసింది. తరువాత రెడ్‌షోర్గమ్, బిగ్ బ్రెస్ట్స్ అండ్ వెడ్ హిప్స్, లైఫ్ అండ్ డెత్ వేరింగ్ మి అవుట్, ది గార్లెక్ బెల్లాడ్స్ లాంటి రచనలు చేశాడు. మో రచనా శైలి వైవిధ్యమైన జానపద కాల్పనిక వాస్తవ సమ్మిళితంగా సాగిపోతుంది. వస్తువులెక్కువగా సమకాలీన లేదా సమీప చరిత్రలోని ప్రధాన ఘట్టాలలోని బాధితుల జీవితాలు.

2012వ సంవత్సరానికి సాహిత్యంలో నోబెల్ బహుమతి మో యాన్‌ని వరించిందని తెలిసిన వెంటనే అక్టోబర్ 11న నోబుల్ కమిటీ ప్రతినిధి **యాన్ షు అంగ్ రింద్ బ్లోమ్** ఆయన్ను టెలిఫోన్ ద్వారా చేసిన ఇంటర్వ్యూ ఇలా సాగింది....

**షు :** మో గారూ ముందుగా అభినందనలు అందుకోండి !!! ఇక, సాహిత్యంలో నోబెల్ బహుమతి వచ్చిందని తెలిసింది. తెలిసిన వెంటనే మీకెలా అనిపించింది?

**మో :** అది విన్న వెంటనే నేనాశ్చర్యపోయాను. ఎందుకంటే సాహిత్యంలో నోబెల్ బహుమతి నాకెంతో దూరంలో ఉందనుకొన్నాను.

**షు :** నోబెల్ ప్రైజ్ వెబ్‌సైట్‌ను చూసేవాళ్ళలో అత్యధికులు హైస్కూల్ స్థాయి విద్యార్థులే ! మీ రచనల్ని చదువగోరే అలాంటి యువ పాఠకులకు లేదా కొత్త పాఠకులకు అందులోని ఏ రచనా ద్వారా ప్రారంభిస్తే మంచిదని సూచిస్తారు?

**మో :** నా ఉద్దేశ్యంలో వాళ్ళు, ఈ సంవత్సరం స్వీడన్‌లో ప్రచురితమైన నా పుస్తకం "లైఫ్ అండ్ డెత్ వేరింగ్ మి అవుట్"తో ప్రారంభిస్తే మంచిది. ఆ తరువాత రెడ్ షోర్గమ్, బిగ్ బ్రెస్ట్స్ అండ్ వైడ్ హిప్స్ లాంటి మిగతా రచనల్ని చదవమంటాను. ఎందుకంటే స్థూలంగా, నా మొత్తం రచనాశైలిని, నవలా సాహిత్యంపై నా శోధనని ఈ పుస్తకం ప్రతిబింబిస్తుంది.

**షు :** మీరు యువకుడుగా ఉన్నప్పుడు, రచయిత కావడానికి ఏది స్ఫూర్తినిచ్చింది?

**మో :** నేను చిన్నతనంలోనే పుస్తకాలు చదవడం ప్రారంభించాను. అలా చదువుతూ పోయే కొద్దీ సాహిత్యంపట్ల నాలో ఓ శ్రద్ధ రగుల్కొంది. దాంతో, వ్యక్తపరచడానికి నాలో కూడా ఎన్నో పదాలున్నాయని, వాటన్నింటిని ఎంతో బలంగా, స్వేచ్ఛంగా వ్యక్తీకరించడానికి సాహిత్య మొక్కటే మార్గనిపించి రాయడం మొదలుపెట్టాను. అలాగే నేనేంటో

నిరూపించుకోవాలని, నా భవితవ్యాన్ని నేనే మార్చుకోవాలనే ప్రగాఢ సంకల్పం కూడా నన్ను రచనలవైపు ఆకర్షించింది.

**షు :** మీ రచనల్ని మాకు క్లుప్తంగా పరిచయం చేయగలరా?

**మో :** నేనిప్పుడే మీతో "లైఫ్ అండ్ డెత్ వేరింగ్ మి అవుట్" అనే పుస్తకాన్ని ప్రస్తావించాను. భూ సమస్యలు, రైతుల సమస్యల్లాంటి చైనీయుల చరిత్ర, నాటి చైనా వాస్తవ పరిస్థితుల నేపథ్యంలో ఈ పుస్తకం రాయడం జరిగింది. అంతేకాకుండా ఈ నవలలో నేను అధివాస్తవిక ప్రాచ్య పదాలను ప్రయోగించాను. ఇందులో జంతువూ, మానవుడూ పరస్పరం స్వేచ్ఛగా మారిపోయేలా రాయడమేగాక, గత యాభై సంవత్సరాల చైనా సమాజాన్ని, చరిత్రలో సంభవించిన మార్పుల్ని ఒక జంతు దృక్కోణంలో పరిశీలించడం జరిగింది. దానికి తోడు, ఈ నవలలో నా గుండెల్లోని భావాల్ని సాధ్యమైనంత సరళ శైలిలో, స్వేచ్ఛగా వ్యక్త పరచగల భాషలో ప్రయత్నించాను. అందువల్ల నేననుకోవడమేమిటంటే, నా మొత్తం రచనల్తో పోలిస్తే, వాస్తవంపై అప్రమత్తతకి, సృజనశైలి శోధనకీ మధ్య ఒక ఖచ్చితమైన మేలు కలయికగా ఈ పుస్తకం నాకనిపిస్తుంది.

**షు :** ఈ పుస్తకాన్ని మీరు కేవలం 43 రోజుల్లో పూర్తి చేశారని ఎక్కడో చదివాను. అంత వేగంగా రాయడానికి మిమ్మల్ని నడిపించిందేమిటి? అలాంటి రచనా సరళి మీకెలా అబ్బింది?

**మో :** అంత తక్కువ సమయంలో దాన్ని ఎలా రాయగలిగానంటారా? దానికి మొదటి కారణం, ఈ నవల వాస్తవ ప్రాతిపదికన రాయడం జరిగింది. నేను ఆరేడు సంవత్సరాల ప్రాయంలో ఉన్నప్పుడు మా స్కూలుకు దగ్గరలో ఓ రైతుండేవాడు. అతను ఆనాటి మొత్తం సమాజం పోకడకి, ముఖ్యంగా పీపుల్స్ కమ్యూన్, సామూహికీకరణలాంటి వాటికి వ్యతిరేకంగా చివరి వరకూ ఒంటరిగా పనిచేశాడు. అప్పట్లో ఓ వ్యక్తి అలా ఉండటాన్ని విపరీతంగా భావించే వాళ్ళు. జనం అతడిని రాక్షసుడితో పోల్చి, కొట్టే వాళ్ళు, తిట్టే వాళ్ళు. అతడు మాత్రం తన అభిప్రాయలకే కట్టుబడి ఉండేందుకు చాలా త్యాగాలు చేయాల్సి వచ్చింది. అతని కుటుంబం, కూతురు, కొడుకుతో సహా ఆయన్ను వెలేశారు. కానీ అతను మాత్రం మారలేదు. తరువాత ఆ నవల రాయడానికి నేను పూనుకొన్నప్పుడు, నేడో రేపో అతనీ నవల ఖచ్చితంగా చదవగలడనే ఉద్దేశ్యంతోనే దాన్ని త్వరగా పూర్తి చేశాను. దీన్ని రాయడానికి నేను 43 రోజులే తీసుకొన్నా, వాస్తవానికి ఈ నవలలోని పాత్రలన్నీ కొన్ని దశాబ్దాలకు ముందే నా మనసులో నాటుకొని ఉన్నాయి. ఊహ పుష్కలంగా ఉండడంతో రచన వేగంగా సాగిపోయింది.

**షు :** ఈ సంబరాన్ని మీరెలా జరుపుకోబోతున్నారు? అలాగే, బహుమతి స్వీకరణకు స్వీడన్ ఎలా రావాలనుకొంటున్నారు?

**మో :** బహుశా రేపటికల్లా నేను నా కుటుంబాన్ని కలుసుకొని, వారితో కలిసి చూపా కుడుములు తినగలననుకొంటున్నాను. ఎందుకంటే మనం కుడుములు సామూహికంగా తినగలమనుకొంటాను. నేను నోబెల్ బహుమతి ప్రధానోత్సవానికి డిసెంబర్ 10న తప్పకుండా స్వీడన్ వస్తాను. మిత్రమా ధన్యవాదాలు. స్వీడన్‌లో కలుసుకొందాం. ఉంటాను!

**విశ్లేషణ :** మిగతా రంగాల విషయంలో ఎలా ఉన్నా, సాహిత్య రంగంలో నోబెల్ బహుమతులు చాలావరకు వివాదాస్పదంగా మారిన విషయం మనందరికీ తెలుసు. మోయన్ ఎంపిక కూడా సాహిత్య ఉద్ధండులను కాస్త విస్మయానికి గురిచేసిందనేది వాస్తవం. అందులోనూ కమ్యూనిస్టు దేశీయులకు నోబెల్ బహుమతి దక్కినప్పుడు అది మరిన్ని అనుమానాలకు దారితీస్తోంది. అరుదుగా సోషలిస్టు దేశస్తులకిచ్చినా, ఆచి తూచి లెఫ్టిస్టు భావజాలాన్ని వ్యతిరేకించిన వారికే ఇవ్వడం మనం గమనిస్తాం. ఇక్కడ గూడా అదే జరిగింది. మో ప్రత్యక్ష్యంగా కమ్యూనిజాన్ని వ్యతిరేకించకున్నా, జానపద కాల్పనిక కథనాల ముసుగులో కమ్యూనిస్టు వ్యతిరేకత చిన్న చిన్న మోతాదుల్లో ఎక్కిస్తూపోయాడు. ఇది మొహంవాచేలా ప్రత్యక్షంగా విమర్శించడం కంటే ప్రమాదం. అందుకాయన జంతు పాత్రల్ని, మనుష్యుల పాత్రల్ని కలగాపులగం చేసి ప్రయోగించాడు. ఈ శైలి మనం జాషువా రచనలు గబ్బిలం, కాందిశీకుడులో ఓ బౌద్ధబిక్షుడి పుర్రెతో కాందిశీకుడు మాట్లాడుతాడు. ఐతే ఈ రెండిటిలోనూ జాషువా నాటి సమాజంలో పేరుకు పోయిన అంటరానితనం, పేదరికం లాంటి సామాజిక రుగ్మతల్ని ప్రత్యక్షంగానే చీల్చి చెండాడాడు. అలాగని లెఫ్టిస్టు బావజాలాన్ని విమర్శించడమే తప్పని చెప్పడం కాదు. విమర్శించడం వేరు, వ్యతిరేకతతో కూడిన ద్వేషభావాన్ని చాపకింద నీరులా పనికట్టుకొని వ్యాపింపజేయడం వేరు. మో చేసింది ఖచ్చితంగా ఇదే. బహుశా అందుకే ఆయన నోబెల్ అకాడమీకి ప్రీతిపాత్రుడయ్యాడు.

ఇక్కడ మరో ముఖ్యకోణం కూడా ఉంది. అమెరికా ఆర్థిక వ్యవస్థ ఇప్పుడు అధ్వాన్నంగా ఉంది. పీకల్లోతు అప్పుల్లో కూరుకుపోయింది. అందులో సగం పైగా చైనాకే ఋణపడింది. పైగా అమెరికా మార్కెట్ మొత్తాన్ని చైనా తన గుప్పెట్లో పెట్టుకొంది. దాన్నుండి బయటపడే మార్గం అమెరికాకు కనుచూపుమేరలో కూడాలేదు. కనుక క్యూబాను వ్యతిరేకించినట్టుగా చైనాను వ్యతిరేకించలేదు. ఈ పరిస్థితుల్లో అమెరికా, చైనాను దువ్వినట్టే నటిస్తూ తన కమ్యూనిస్టు వ్యతిరేకతను కొనసాగించాలి.

కమ్యూనిస్టు ముసుగులో ఆ భావజాలాన్ని వ్యతిరేకించే సంస్థల్ని, వ్యక్తుల్ని వెనకేసుకు రావాలి. ఈ కోణంలో చూస్తే, మో యాన్ కు నోబెల్ బహుమతి కూడా ఆ వ్యూహంలో భాగమేనేమో.

**రచయిత సెల్ : 9492922492**

# కలలు

డా. మానేపల్లి

✆: 08931-231834



కలలు కనడానికి స్తోమతువుండాలి
పెట్టిపుట్టాలి, దమ్ముండాలి
కలలు కనగానే సరిపోదు

కడుపు నిండనివాళ్ల కలలు
కమ్మగా వుండవు
కడుపు నిండనివాళ్ల కలలు
కళకళలాడవు
కడుపు నిండని వాళ్ల కలలు
రంగురాళ్లలా వుండనే వుండవు
కనీసం గులకరాళ్లలా కూడా వుండవు

కలలు నిజం కానప్పుడు
కలలన్నీ గర్భస్రావాలయినప్పుడు
కలలు కనిమాత్రం ఏంలాభం
కంటకావృతమైన దారిలో
కలలు ఎలా నడవగలవు
కలలు కలలేకంటే
కళ్లు కరిగిపోతాయి
కలలు రాని గాఢనిద్ర కోరుకో

* * *

కలలు కనాలి - కలలు
కలలు మనజన్మహక్కు

* * *

సోషలిజం ఒక సుదూరకల
కమ్యూనిజం కష్టసాధ్యమైన పెద్దకల
సమసమాజం కూడా ఇప్పటికి కలే
కలలు నిజం చేసుకోవాలంటే
కష్టించాలి, కృషి చెయ్యాలి
కలల్తో ప్రాణాలు పోగొట్టుకోవచ్చు
కలలకు ఉరిపోసుకోవచ్చు
కలల కోసం కష్టాల్లో మునగొచ్చు

కలలు ప్రాణం పొయ్యవచ్చు
కష్టాన్నించి గట్టెక్కించనూ వచ్చు
కమ్మగా కడుపు నింపనూ వచ్చు
కలలే కనొద్దనడం కరెక్టు కాదు

కలలు కన్ను తెరిచికూడా కనొచ్చు
కలలు దీర్ఘాయువునిస్తాయి
కలలు నీ యిష్టఫలసిద్ధిరస్తంటాయి
కలలు నీ కడుపు పండిస్తాయి

కలలు కను - నిరంతరం కలల్లో బ్రతుకు
కలలు సాకారం కావాలంటే
ఏం చెయ్యాలో అది చెయ్యి
కలలు కనలేకపోవడం - వద్దు
కలలు కళ్లనిండా వేలాడుతుంటే
జీవితం ఎంత సుఖంగా
వుంటుందో
కనుక కలలు కనాలి కలలు

*

## కథ

# బొడ్రాయి

మేరెడ్డి యాదగిరిరెడ్డి

✆ 9949415796



'ఊరికి కీడు చుట్టుకుందిరో
ఊరికి కష్టం వచ్చిందిరో
చిన్నా పెద్దాలేదు, భయం భక్తి లేకుండా పోయాయిరో
మూడేండ్ల నుండి వానలేవు కరువొచ్చింది
అక్కల్లారా చెల్లెండ్లారా మీ పసుపు కుంకుమలకు
ముప్పొంచ్చిందే తల్లీ'

కెవ్వున కేకవేసి యాప మండలూపుతూ, కిందికి మీదికి వూగుతూ, కొలువు చెప్పడం మొదలుపెట్టి శారదాంబ డప్పు చప్పుళ్లతో వూగిపోయింది. చుట్టూ బోనం కుండలతో సీతాకోకచిలుకల్లా ఆడపిల్లలు. ఆరోజు వూర బోనాల పండుగ. ఏటా శ్రావణ మాసంలో ముత్యాలమ్మకు బోనాలు పెట్టి, వన భోజనాలకు వెళ్ళడం వారి ఆచారం. ఊరు ఊరంతా కదిలింది. ఊరి మధ్య యాప చెట్ల కిందికి వచ్చేసరికి శారదాంబకు పూనకం వచ్చింది. శారదాంబ పూనకంలో ఏదో చెబితే అదే జరుగుతుందని వాళ్ల నమ్మకం.

'చెప్పుతల్లీ చెప్పు మా తప్పేంటో చెప్పు' రెండు చేతులు జోడించి అడిగాడు గొల్ల పెద్ద మల్లయ్య. వయసులో పెద్దవాడు, మంచి మాటకారి, మంచివాడనే పేరుంది. తలకు రుమాలు, మోకాల్లదాకా నడికట్టు దోవతి, రెండు చేతులకు వెండి కడియాలు చేతిలో దుడ్డు కర్ర నిండైన మనిషి.

'అమ్మా ముత్యాలమ్మ తల్లీ ఏటా బోనాలు పెడుతూనే వున్నాం గదా' మైనం మల్లయ్య అన్నాడు.

'ఏటా మేకపోతుల బలి ఇస్తూనే వున్నాం గదా తల్లీ' మల్లయ్య అన్నాడు .

'కల్లు కుండలు ఆరబోస్తునే వున్నాం. కొత్త చీర, రవిక పెడుతూనే వున్నాం గదా' గేండ్ల ముత్తమ్మ అన్నది.

'మా తప్పేంటో చెప్పమ్మా చెప్పు' అప్పుడే బైకు దిగిన మాజీ కరణం సీతారామరావు అన్నాడు. ఆయనకు తోడుగా సర్పంచ్ రమణారెడ్డి వచ్చాడు. సీతా రామారావు వి.ఆర్.వో గా చేసి ఈ మధ్యనే రిటైర్ అయ్యాడు.

సీతారామరావు పట్వారిగా, సర్పంచ్‌గా రమణారెడ్డి ఆవూరిని తమ గుప్పిట్లో పెట్టుకున్నారు. ఎక్కడికెళ్లినా జంటపక్షుల్లా ఇద్దరూ వెల్లవలసిందే. ఆ ఊరికి ఏకాంట్రాక్టు వచ్చినా రోడ్డుపనులు బడి, మురికి కాలువలు, ట్యాంకులు వారిద్దరుకాకుంటే వారి బినామీలు చేయవలసిందే. అధికార పార్టీ అండవుండనే వుంది.

సీతారామారావు భూముల వ్యవహారాలు, సర్పంచ్ రమణారెడ్డి సివిల్ పంచాయితీలు చెబుతూ అధికారాన్ని చెలాయిస్తూ వస్తున్నారు. ప్రతి పనికి లంచాలు వసూలు చేయడం. ఎదురు తిరిగిన వారిని అణగదొక్కడం నిత్యకృత్యమైపోయింది.

వీరి ఆగడాలు చెక్ పెట్టడానికి చదువుకున్న యువక బృందం ముందుకు వచ్చింది. వీరి అకృత్యాలు సమాచార హక్కు ద్వారా జనాలకు తెలియచేశారు. కిషోర్, షమీకుమార్, పి.జి. విద్యార్థులు నాయకులుగా ముందున్నారు. పెన్షెన్లు, రేషన్ కార్డులు అందరికి అందే ఏర్పాట్లు చేశారు. వూరి జనానికి వీరిపై గురి కుదిరింది. రెడ్డి, రావు బృందం వెనకడుగువేశారు. వారి పెత్తనానికి గండిపడింది.

శారదాంబ ఏం చెబుతుందోనని జనమంతా ఆసక్తిగా ఎదురుచూస్తున్నారు. శారదాంబ చెంగున ఎగిరి కేకపెట్టింది. తలవెంట్రుకలన్నీ ముందుకు వచ్చాయి. 'చూడండి మనవూరికి బొడ్రాయి వుందా' 'లేదు లేదు' జనం అరపులు. 'బొడ్రాయి లేనూరికి ఎచ్చుగంత వుంటుందా' 'వుండదు వుండదు' జనం కేకలు. 'అందుకే

మనకన్ని కష్టాలు వచ్చాయి నాయినో' తల అటూ ఇటూ వూపుతూ శారదాంబ అన్నది.

'అవును నిజమే బొడ్రాయి ఎప్పుడో పూడిపోయింది' అందరూ ఆలోచనలో పడ్డారు. శారదాంబ మాటలతో కరణం, రెడ్డి ముఖాలు వెలిగిపోయాయి. పసుపు కుంకుమ చల్లి శారదాంబ మీద ఆడవాళ్లు నీళ్ళు కుమ్మరించారు. కొలుపు ఆగింది. 'శాంతించు తల్లీ' నీవు చెప్పి నట్లే చేస్తాం అన్నాడు కరణం.

శారదాంబది ఎరుపు రంగు. కోలముఖం, మిల మిల మెరిసే కళ్ళు చక్కటి పలువరస. నడి వయసయినా చెక్కు చెదరని 'అందం' ముఖాన నిలువుగా తిలకం బొట్టు. మెడలో సన్నటి రుద్రాక్షలు. చిన్నతనంలోనే పెళ్ళి జరిగింది. భర్త సాయిలు రమణారెడ్డి దగ్గరే జీతం వుండేవాడు. ఉన్నట్లుండి ఓ అర్ధరాత్రి సాయిలు మాయమయిపోయాడు. ఇంతవరకు అతని జాడలేదు. సర్పంచ్ రెడ్డికి ఈమెకు ఏదో సంబంధముందని వూరంతా గుసగుసలు. భర్త వెళ్ళిపోయిన కొద్ది రోజులకే శారద, శారదాంబగా అవతారమెత్తి కొలుపు చెప్పడం మొదలుపెట్టింది.



రమణారెడ్డి యల్లమ్మ గుడి కట్టించాడు. బేస్తవారం, ఆదివారం కొలుపుకు చుట్టుపట్ల గ్రామాల జనం జాతరలా వచ్చేవారు. వచ్చిన వారికి తాయితలులో నిమ్మకాయలు ఇవ్వడం బాగానే గిట్టుబాటయ్యేది. తల్లి కొబ్బరికాయలు, నిమ్మకాయలు అమ్మేది. తను చిన్నతనం. తల్లి కడుపు నొప్పి కోసం దేవునమ్మల చుట్టూ తిరిగేది. తల్లి వెంట వెళ్ళి చూసి తను దేవునమ్మయింది శారద.

బోనాలన్నీ ముత్యాలమ్మ గుడివైపు కదిలాయి. అంతా బొడ్రాయి ముచ్చట్లలోపడ్డారు. ఈమధ్య వేలం వెర్రిగా ఏవూరు చూసినా బొడ్రాయి ప్రతిష్ట కార్యక్రమాలే. సాయంత్రం పంచాయితీ ఆఫీసు దగ్గర 'బొడ్రాయి' గురించి మీటింగు వుందని చాటింపు వేయించాడు సర్పంచ్ రెడ్డి.

సాయంత్రానికి వూరి పెద్దలంతా పంచాయతి ఆఫీసు ముందు సమావేశమయ్యారు. కానుగుచెట్ల చల్లనీడ, ఓ పక్క నీళ్ళ ట్యాంకు. మధ్యన కుర్చీ మీద సర్పంచ్ రమణారెడ్డి. 'బెంచీల మీద వార్డు మెంబర్లు కరణం కూర్చున్నారు. ఊరి కులపెద్దలు గొల్ల మల్లయ్య, చాకలి సైదులు, కుమ్మరి కొండయ్య మాదిగ ముత్తయ్య, కూలీలమేస్త్రీలు లక్ష్మమ్మ, ముత్తమ్మ, యువక బృందం కిషోర్, షమీకుమార్ కూర్చున్నారు.

"చూడండి పొద్దున దేవునమ్మ శారదాంబ చెప్పిన మాటలు అందరం విన్నాం. ఈ మధ్య మనూరిలో వరుస చావులు, పశువులకు రోగాలు మనుసులకు రోగాలు కరువులు ఇవన్నీ ఒకదాని వెంట ఒకటి శనిలా పట్టి పీడిస్తున్నాయి." సర్పంచ్ అన్నాడు.

'అవును సర్పంచ్ గారు పచ్చని పంటలతో, పిల్లా పాపలతో కలకలలాడిన మన వూరు ఇలా అయింది. బొడ్రాయి లేకపోవడమేనని నాకూ అనిపిస్తుంది' కరణం సీతారామారావు శారదాంబ కొలుపుకు వంతపాడాడు.

"చుట్టూ పట్ల అన్నూర్లల్ల బొడ్రాయి ఏస్తుండ్రు మన వూల్లె కూడా బొడ్రాయి వేద్దాం' గొల్లమల్లయ్య అన్నాడు. "వూరు బాగుండాలంటే బొడ్రాయి వెయ్యవలసిందే" అక్కడ కూర్చున్న ఎక్కువమంది అదేమాట అన్నారు.

"మన వూరిలో జరిగే ఈ అనర్ధాలన్నిటికో బొడ్రాయి ఒక్కటి కారణం కానేగాదుబాబాయి. సర్పంచ్ గారి పశువుల కొట్టం దగ్గర మంచి నీళ్లపైపులు పగిలి కలుషితమయ్యి ఆ నీళ్లుతాగి వాంతులు విరేచనాలతో సరియైన వైద్యం అందని వాల్లు చనిపోయారు" కిషోర్ నిల్చునే అన్నాడు.

"మరి వరుసబెట్టి ఆవుదూడలు, బర్రెపడ్డలు ఎందుకుచచ్చాయి"

"అదీ చెబుతా రెండు మూడెండ్ల నుండి మనూరిలో పశువులకు టీకాలు వేయించడం లేదు. నిలబడ పసురం అట్లే చచ్చిపోతున్నాయి. ముందే టీకాలు వేయిస్తే ఇలాకాక పోయేది" ఇది సర్పంచ్ బాధ్యతకాదా?

"కోటి కొండయ్య కడుపు నొప్పితో వురేసుకున్నాడు. మల్లారెడ్డి పటేల్ స్టాటర్ కరెంట్ వైర్లు తేలింది చూసుకోక కరెంట్ షాక్‌తో చనిపోయాడు" వీటన్నిటికి' బొడ్రాయి'కి ఏంటి సంబంధం. ఈ కరువు కాలంలో అప్పులు చేసి బొడ్రాయి వెయ్యడం అవసరమా" కిషోర్ బృందం వాదనకు దిగింది. అరుపులు, కేకలు, కాసేపటి దాకా ఎవరు ఏం మాట్లాడేది వినిపించలేదు. ఒరేయి వూరు కోండ్రా పిల్లకాకి కేందెలుసు వుండేలు దెబ్బ. వూరంటే మంచి చెడ్డలుంటాయి. వూరదేవతలుంటాయి పూజ పన్నాగం వుంటుంది. వాళ్ల మాటకేంగాని 'బొడ్రాయి' ఎట్ల ఏద్దాం చెప్పురి సర్పంచ్ గారు అన్నాడు గొల్ల మల్లయ్య' ఎక్కువ మంది బొడ్రాయి వెయ్యవలసిందే అని పట్టు బట్టారు.

'బొడ్రాయి వేయదమంటే మాటలా లక్షల ఖర్చవుతుంది' చాకలి సైదులు అన్నాడు

'అవును దేశ గురువే కట్నంగా లక్షరూపాయలు తీసుకుంటాడు" కారణం అన్నాడు. డబ్బులు ఏలా సమకూర్చుకోవాలి. ఏంచేయాలి? అందరూ ఆలోచనలోపడ్డారు.

'చూడండి మనసుంటే మార్గముంటుంది. పెద్ద రైతులంతా తలా కొంత వేసుకుందాం. ఎవరిస్తోమత తగ్గట్టువాళ్లు తృణమోఫణమో ఇవ్వండి. నావంతుగా నేను ఓ పదివేలిస్తా" సర్పంచ్‌రెడ్డి మాటలకు జనం చప్పట్లు చరిచారు.

'ఇంకో విషయం ఇంతవరకు మనవూరిలో బెల్టుషాపులేదు. అలాగని తాగకుండా ఎవరూ వుండటం లేదు. చాటు మాటుగా అమ్మేవాళ్లు అమ్ముతున్నారు. తాగే వాళ్లు తాగుతున్నారు. దానికి వేలంపాట పెడదాం. ఎటులేదన్నా ఓ యాభయివేలువస్తాయి"

సర్పంచ్ మాట పూర్తి కాకుండానే యువక బృందం అడ్డు తగిలింది. అలాచేయడానికి వీల్లేదంది. అయినా వారి మాటలు ఎవరు ఖాతరు చేయలేదు. ఎక్కువమంది బెల్ట్ షాపు వేలం పాటకే మొగ్గు చూపారు.

"ఇంకో విషయం సర్పంచ్ గారు మనూరి వాగు ఇసుక వేలం పాట పెడదాం అలాగే పెద్ద బండ మీద రాయి వేలం పాటపెడదాం రెంటికి కలిపి ఎటులేదన్నా ఓ యాబయివేలు వస్తాయి" కరణం మాటలు అందరికి హుషారెత్తించాయి.

'అలాగే అలాగే' ముక్త కంఠంతో అందరు ఒకేసారి అన్నారు. అంతా బొడ్రాయి మైకంలో పడ్డారు. యువకుల మాటలను లెక్క చేయలేదు. "సరిపోకపోతే ఇంటికింత వేసుకుందాం' 'మేస్త్రీ' ముత్తమ్మ అన్నది.

'ఇగోకరణం గారు దేశ గురువుకు ఫోన్ చేయండి 'సర్పంచ్ పురమాయించాడు. ఈ మధ్యనే పక్క వూరు ఇండ్లూరులో బొడ్రాయి ప్రతిష్ట చేసిన దేశ గురువు రఘుపతిరెడ్డికి ఫోన్ చేశాడు కరణం.



బొడ్రాయి ప్రతిష్టకు లక్షన్నర, తనకు తన శిష్యులు పదిమందికి రోజు వారి ఖర్చులు, పదిరోజుల బసకం ఏర్పాటు చేయాలన్నాడు. తన నాలుగు గుర్రాలకు మేత వసతి ఏర్పాటు చేయమన్నాడు. కార్తీకశుద్ధ పాడ్యమి బొడ్రాయి ప్రతిష్టకు మంచి రోజని చెప్పాడు. మధ్యలో ఒకసారి వచ్చిపూజ సామాను రాసిస్తా ఆరోజే తనకు కొంత అడ్వాన్స్ ఇవ్వాలని చెప్పాడు అందరి అంగీకారంతో దేశ గురువుతో కార్యక్రమానికి ఓ.కే చేయించాడు కరణం.

కరణం, సర్పంచ్ ముఖాలు వెయ్యి వోల్టుల బల్బుల కాంతితో వెలిగిపోయాయి. గత రెండేండ్లుగా తమ ప్రతిపనికి యువక బృందం ఎదురు తిరగడం చేస్తుండేది ఈసారి తమ విజయానికి పొంగిపోయారు. చీకటి పడుతుందని ఎవరింటికి వారు వెళ్ళారు. సర్పంచ్, కరణం వారి బృందం మందు సేవనానికి సర్పంచ్ బంగళాకు వెళ్ళారు.

నెలరోజుల ముందుగానే ఫలానా రోజు బొడ్రాయి ప్రతిష్ట జరుగుతుందని ఉప్పు చాటింపు చేశారు. అందరిలో టెన్షన్ మొదలయింది. డబ్బుల వేటలోపడ్డారు.

సావిత్రి గుండె గుభేల్మంది. చేతిలో చిల్లిగవ్వలేదు. ఇదివరకు చేసిన అప్పులే తీరలేదు. పెద్ద పిల్ల పెద్దమనిషయితే మైక్రో ఫైనాన్స్ వాళ్ల దగ్గర తెచ్చిన పదివేల డప్పు అలాగే వుంది మొగుడు తాగుబోతు. అందినకాడల్లా అప్పులు చేసి తాగి వచ్చి ఇంట్లో నానా గొడవలు చేస్తుంటాడు. పిల్లల చదువు సంసారం నడపడం సావిత్రి వంతు. ఇప్పుడు ఈ బొడ్రాయి పండుగగట్టెక్కాలంటే ఎటులేదన్నా ఓ ఇరవయివేలు కావాలి. ఆడబిడ్డలు నలుగురికి తన ఇద్దరి చెల్లెండ్లకు బట్టలు తేవాలి. ఇంట్లోకి బియ్యం సామాన్లు ఓ మేకపిల్లను కొనాలి. ఇంటికి వచ్చిన ఆడవాళ్లందరికి పసుపు కుంకుమ బట్ట బాతాపెట్టాలి.

అప్పుకొరకు ఇల్లిల్లు తిరిగింది. ఎక్కడా అప్పుపుట్టలేదు. వూళ్ళో అప్పులిచ్చేవాళ్లిద్దరే. కరణం సీతా రామారావు, షావుకారు మల్లయ్య. మల్లయ్య నడిగితే తన దగ్గర దొరకవన్నాడు. కరణం ఇంటికి వెళ్ళింది సావిత్రి. చుట్టూ వంధిమాగదులతో గిరీశం పంతులు లాగ సిల్కు లాల్చి వేసుకుని సిగరెట్ కాలుస్తూ ముచ్చట్లలో మునిగి తేలుతున్నాడు కరణం. వాళ్ళందరూ వెళ్ళిపోయిందాకా ఓ మూల నిల్చుంది సావిత్రి.

'పంతులు గారూ ఓ ఇరవయివేలు అప్పుకావాలి. తొందరలోనే తీర్చేస్తాను' మీరడిగిన వడ్డి ఇస్తాను. మీ ఇంటి ముందు రోజూ వూకి చల్లుతాను. ఎట్టన్నా ఈగండం గట్టెంక్కించండి పంతులూ' ప్రాధేయ పూర్వకంగా అడిగింది సావిత్రి'

కరణాన్ని జనాలు పంతులు అని కూడా' పిలుస్తారు. సావిత్రి వైపు అదో రకంగా చూస్తూ సిగరెట్ పీలుస్తున్నాడు కరణం.

'చింత చచ్చినా పులుపు చావని ఈ ముసలోని ఈ చూపులేంటి? పేరు సీతారామారావేగాని అన్నీ వెకిలి బుద్దులే. వయసులో వున్నప్పుడు ఎందరి సంసారాలు పాడుచేయలేదు ఛీ పాడు బుద్ధి' అనుకుంది సావిత్రి'

ఏదో ఆలోచిస్తున్నట్టు తలకిందికి మీదికి ఊపి మరో సిగరెట్ వెలిగించాడు కరణం 'చూడమ్మా సావిత్రీ నాదగ్గర అప్పులిచ్చే డబ్బుల్లేవు గాని, జీతగాండ్ల కొరకని చూస్తున్నా, అవునూనీకో కొడుకున్నాడు గదూ వాణ్ణి జీతముంచి నీవడిగినంత తీసుకపో' ముసిముసి నవ్వుతూ అన్నాడు.

సావిత్రి గుండె గుభేలుమంది. చదువుకునే తన కొడుకు మీద ఎన్నో ఆశలు పెట్టుకుంది. చదివించి మంచి వుద్యోగం చేయించాలనుకుంది బాగా చదువుతాడని టీచర్లంటారు.

'వాడు చదువుకుంటున్నాడు గాని మా ఆయన్ని జీతం పెట్టుకోని అప్పివ్వండి" అంది సావిత్రి

ఈ 'యవసం చేయకున్నా పర్వాలేదు గాని ఆ తాగుబోతు మాత్రం నాకొద్దు నీ యిష్టముంటే నీ కొడుకు నుంచి' పట్టు బిగించాడు కరణం.

చాలాసేపు నిలబడి ఆలోచించింది సావిత్రి. ఈ ఒక్క సంవత్సరం వాన్ని జీతముంచి వచ్చే సంవత్సరం అప్పు తీర్చి బడికి తోలవచ్చు అనుకుంది. పంతులు గారికి కాగితం రాయించి యిచ్చి అప్పు తెచ్చుకుంది సావిత్రి. తన పాచిక పారినందుకు తెగ మెరిసిపోయాడు కరణం సీతారామరావు.

ఇంకో ఇల్లాలు చంద్రమ్మ సంగతి అంతే. ఏడవతరగతి చదువుతున్న కూతురు ఇందిరను పట్నంలో రమణారెడ్డి కూతురు దగ్గర పనిపిల్లగా వుంచి అప్పు తెచ్చుకుంది. చాలామంది జీతాలుండి, నగలు కుదువ బెట్టి అప్పులు చేశారు. ఇంకొంతమంది మైక్రోఫైనాన్స్ వాళ్ల దగ్గర ఇంటికో పదివేలు అప్పుచేశారు.

ఊరంతా సందడి సందడి. బొడ్రాయి ప్రతిష్ట రోజు రానే వచ్చింది. వూరు పండగ వాతావరణం సంతరించుకుంది. ఇంటింటికి సున్నాలు, రంగులు వేయించి మామిడాకుల తోరణాలు కట్టారు. ఒకరోజు ముందే ఆడపిల్లలు, అల్లుండ్లు పిల్లలు వచ్చారు. ఎక్కడెక్కడ బంధువులో వూరు చేరుకున్నారు. వూరి చుట్టూ పొత్తి పోసే ముందే అంతావూల్లోకి చేరారు.

బొడ్రాయి ప్రతిష్ట దగ్గర రంగు రంగుల కరెంటు దీపాలు అమర్చారు. చుట్టూ టెంట్లు వేశారు. ఊరంతా మైకులు బిగించారు. భక్తి పాటల హోరు వూరిని ముంచేసింది. రకరకాల దుకాణాలు వెలిశాయి. వెరసి జాతరను తలిపిస్తున్నాయి.

సాయంత్రం పేదింటికి పూజ మొదలవుతుంది పూజ

సామానువడ్లు రవికె, ముడుపు కొబ్బరికాయలు తీసుకుని రావాలని దేశ గురువు రఘుపతిరెడ్డి మైకులో ఎనౌన్స్ చేశాడు.

పూజ మొదలయింది వాడపల్లి కృష్ణానదిలో తెచ్చిన బొడ్రాయికి పసుపుకుంకుమ రాసి పెద్దలతో కొబ్బరి కాయలు కొట్టించాడు రఘుపతిరెడ్డి. మైకులో మంత్రాల జోరు పెరిగింది. వూరి జనమంతా అక్కడికి చేరారు.

ఓ ట్రాక్టరు మీద వడ్ల బస్తాలు. ముందు గుర్రం మీద దేశ గురువు. వెనుక గుర్రాల మీద శిష్యులు కూర్చున్నారు. వీరందరి ముందు డప్పులవాల్లు సన్నాయి బ్యాండు మేలగాల్లు. కోలాటాల వాళ్ళు, భజన బృందాలు, చిరుతల రామాయణం వాళ్లు ఎవరి హడావిడి వాళ్లది. డ్యాన్సులు, కత్తుల విన్యాసాలు, కర్రతిప్పటాలు అదో సందడి. దేశగురువు గుర్రం ముందుకదలగా ఆ వెనుక వూరి జనమంతా. ఊరి చుట్టూ పొత్తి పోసే కార్యక్రమం మొదలయింది.

ఊరి నాలుగు వైపులా వూరిలోకి పొత్తి పోసేంత వరకు మనుష్యులు రాకుండా కాపలా వుంచారు. రఘుపతిరెడ్డి ఠీవిగా గుర్రాన్ని గౌడు తీయిస్తుంటే వెనుక శిష్యులు బస్తాకు రంధ్రం పెట్టి వడ్లుదారగా పోసుకవస్తున్నారు. బస్తా అయిపోగానే ట్రాక్టరు నుండి వడ్లబస్తాలు వస్తూనే వున్నాయి.

చీకటి పడే వరకు పొత్తి పోసే కార్యక్రమం పూర్తయింది. నాలుగు వైపుల ఆగిపోయిన జనం బిల బిల మంటూ వూరు చేరారు. ఆగిపోయిన కార్లు, మోటారు సైకిళ్ళు, ఆటోలు, వూరిలోకి వచ్చిపడ్డాయి.

రాత్రి పన్నెండు గంటల ప్రాంతంలో బొడ్రాయి ప్రతిష్ట మొదలయింది బొడ్రాయి ప్రతిష్ట వేదిక మార్బుల్ బండలు వేసి పూలతో అలంకరించారు. చుట్టూ మామిడాకులు కట్టారు కులపెద్దలు వూరి జనమంతా అక్కడికి వచ్చారు.

దేశగురువు రఘుపతిరెడ్డి బాసింపట్టు వేసుకుని అరుగుమీద కూర్చున్నాడు. రఘుపతిరెడ్డిది భారీ విగ్రహం. మెడలో రుద్రాక్షమాల, చేతికి బంగారు కడియం చెవికి బంగారు పోగు. నుదుట సింధూరం బొట్టు, వుంగరాల నెత్తి, మాటలతో ఎంతటి వారినైనా మాయ చేయగలదిట్ట. బ్రహ్మచారి తరతరాలుగా ఇదే వృత్తి.

కొబ్బరికాయలు, నిమ్మకాయలు, పసుపుకుంకుమ, పూలుపండ్లు, నవధాన్యాలు తన ముందుంచుకున్నాడు. సర్పంచ్ రమణారెడ్డితో ముందుగా కొబ్బరికాయ కొట్టించి నవధాన్యాలు, పసుపుకుంకుమ గుంటలో వేయించాడు. ఆ తర్వాత వరుసగా కులపెద్దలు ఊరి వారందరితో నవధాన్యాలు వేయించి పూజా కార్యక్రమం చేయించాడు. మంత్రోచ్ఛరణ, డప్పుల మోతలు, జనం కోలాహలం మధ్య తెలతెల వారుతుండగా బొడ్రాయి ప్రతిష్ట కార్యక్రమం ముగించాడు రఘుపతిరెడ్డి ఇక మిగిలింది బలి మారణం.

తెలతెలవారుతుండగా బోనం కుండలతో ఆడపిల్లలంతా బయలుదేరారు. వారి వెనుకనే ఇంటికో మేకపోతును తోలుకొని బలి యిచ్చేందుకు వచ్చారు జనం. సర్పంచ్‌రెడ్డి బోనం ముందర పెట్టించాడు దేశగురువు. అప్పుడు మొదలయింది రగడ "ఆచారం ప్రకారం తన బోనం ముందు పెట్టాలని' గొల్ల పెద్ద మల్లయ్య గురువును నిలదీశాడు" ఎన్నో ఏండ్లుగా ముందు మల్లయ్య బోనమే పెడుతున్నామని కుల పెద్దలంతా చెప్పారు."

తప్పు తెలుసుకుని అవాక్కయిన రఘుపతిరెడ్డి మల్లయ్యను పిలిచి బొట్టుపెట్టి బొడ్రాయి మీద పసుపు కుంకుమ చల్లించి మల్లయ్య బోనం కూడా సర్పంచ్ బోనం ముందుకు జరిపాడు. గొడవ సద్దు మణిగింది. మల్లయ్య శాంతించాడు.

బోనాల కార్యక్రమం అయిపోయిం తర్వాత బలి కార్యక్రమం మొదలయింది. ముందుగా అన్నం కుంభంగా పోసి మూడు మేకపోతుల బలిచ్చారు. ఆ రక్తాన్ని అన్నంలో కలిపారు. బలిగంపలకు ఎత్తారు. "ఊరి చుట్టూ పొలాల్లో చల్లండి పంటలు బాగా పండుతాయి. "రఘుపతిరెడ్డి బైండ్ల వారితో చెప్పాడు చాకలి సైదులు, కుమ్మరి కొండయ్య తలా ఓ గంపలు ఎత్తుకున్నారు. రైతులు పోటీలు పడి తమ పొలాల్లో బలి చల్లించుకున్నారు.

మూడు మేకపోతులతో ఒకటి దేశ గురువుకు. ఇంకొకటి కుల వృత్తుల వారికి మూడోది సర్పంచ్, కరణం, ఊరి పెద్దల ఇండ్లకు పంపబడింది. వరుసగా వూరి వారి మేకపోతుల బలి కార్యక్రమం ముగిసింది.

అందరి ఇండ్లలో వంటల కార్యక్రమం మొదలయింది. చుట్టాలతో ఇండ్లన్నీ కిటకిటలాడాయి. ఎక్కడికక్కడ సిట్టింగులు. మందు సీసాలు ఖాళీ అవుతున్నాయి. తెచ్చిన సరకు చాలక చాలా మంది బెల్ట్ షాపుల వైపు వురుకులు పరుగులు. తను పాడిన వేలంపాట ఒక్కరోజులోనే పూడినందుకు బెల్ట్ షాపు యజమాని వుబ్బి తబ్బిబ్బయ్యాడు.

సాయంత్రం దేశ గురువు నుండి వూరి పెద్దలకు పిలుపు వచ్చింది. గురువుకు ఇవ్వాల్సిన లక్షన్నర రూపాయిలు తీసుకుని సర్పంచ్ కరణం మిగతా పెద్దలంతా అక్కడికి చేరారు.

వాళ్లు వచ్చేసరికి రఘుపతిరెడ్డి మంచి మందు పార్టీ ఏర్పాటు చేశాడు. మందు బాటిల్స్ మాంసం ప్లేట్లు, గ్లాసులు టేబిల్ మీద వుంచాడు వీటన్నిటి చూసిన పెద్ద మనుష్యుల తలతిరిగిపోయింది.

'మంత్రాలు చదివే గురువులు తాగుతారా' కరణం ఆశ్చర్యంగా అడిగాడు. క్షుద్రపూజలు చేసే మాలాంటి వాళ్లకు తప్పదు మరి' ముసిముసి నవ్వుతో గ్లాసులు నింపి అందరికి ఇచ్చాడు.

'పూజా కార్యక్రమం చేసేటప్పుడు నిష్టగానే వుంటాం గ్లాసునోటి కాడపెట్టుకుంటూ అన్నాడు గురువు.

దావతు ముగిసాక తనకు రావలసిన డబ్బులు తీసుకుని వచ్చిన వాళ్లకు మంత్రించిన కొబ్బరికాయలు రవిక ముడుపు లిచ్చి ఆశీర్వదించాడు. కార్యక్రమము సాఫీగా జరిగినందుకు ఒకరినొకరు అభినందించుకున్నారు.

ఏతావాతా బొడ్రాయి పుణ్యమా అని ఆవూరిలో ఓ యాభయి లక్షల ఖర్చయింది. ఊరు అప్పుల ఊబిలో దిగబడింది. చాలా మంది చదువుకునే పిల్లలు జీతాలకు, పనిపిల్లలుగా కుదిరారు. రెడ్డి, రావులకు జీతగాండ్ల కొరత తీరింది. దేవునమ్మ, శారదాంబ ముంజేతికి బంగారు కడియం వచ్చింది. అంతదాకా ఇంటి నిర్మాణాలకు వాగు ఇసుక, బండ మీదిరాయి ఉచితంగా దొరికేది. వేలం పాటతో ఇసుక, రాయి కొనవలసి వచ్చింది. మైక్రొఫైనాన్స్, వడ్డీ వ్యాపారుల వ్యాపారం బాగా నడిచింది. ఆ ఊరు కోలుకునే వరకు ఎంతకాలం పడుతుందో చూడాలి మరి. ♦

## పాపం

గాయత్రి
✆ 9949431849

పాప ఏడ్చింది .....!
పుట్టకముందే ......... !!
చంపేస్తారో ....? అమ్మేస్తారోనని ....??
చెత్తకుప్పలను చీల్చుకొని
అమావాస్య చీకటిని అధిగమించి
కరాళమృత్యువును ఛేదించుకొని
మనుగడను సాగించింది
చెల్లిగా మురిపించి
నెచ్చెలిగా మైమరపించి
అమ్మగా ఆప్యాయతను పంచి
సుద్దులెన్నో చెప్పి
బుద్దులెన్నో నేర్పి
జీవిత ప్రస్థాన చివరి మజలీలో
తన అంతిమకోర్కెను ఆర్తిగా
అందరికి వినిపించింది.
దయగల తల్లులారా !!



భారతి పుత్రులారా !!!
పాపలను రక్షించి
పాపాలను ప్రక్షాళించి
'సమ' సమాజాన్ని స్వాగతించండి.

## గజల్

ద్యావరి నరేందర్ రెడ్డి
✆ 9848995597

అహమంతా ఆవిరవగ-శాంతమౌను జీవితం
ప్రేమంతా ఊపిరవగ-ధన్యమౌను జీవితం

వెలిగించగ వస్తారని-ఎదురుచూపు లెందుకో!
అనుభవాలు దివ్వెలవగ-దివ్యమౌను జీవితం

శిలవోలే మిగిలిపోతె-సిద్ధించదు యోగమే
తనకు తాను శిల్పియవగ-శిల్పమౌను జీవితం

రాగద్వేష భావాలే-ఆరకుంటె అనర్థం
వ్యర్థమంత దూరమవగ-అర్థమౌను జీవితం

సత్యాలను సహనంతో-ఒప్పిస్తే హాయిలే
పలకరింపు తీయనవగ-పుష్పమౌను జీవితం

చింత తీర్చలేని సిరులు-ఎన్నియున్న ఫలమేమి!
చిరునవ్వులు సొంతమవగ-స్వర్గమౌను జీవితం

మరుపురాని మమతలన్ని-మధురిమలే నరేంద్రా!
అనుభూతులు సారమవగ-కావ్యమౌను జీవితం



## రెక్కలు తెగిన స్వేచ్ఛ

ఆవుల వెంకటేశులు
✆ 94416650952

రత్నగర్భలో జీవం పోసుకుంటున్న
అంకురాన్ని తుంచివేయాలని
భ్రూణహంతకుని కరవాలం పదునెక్కుతుంటే
నోరులేని నిజం రెక్కలు తుంచటానికి
క్రౌర్యం రాసుకున్న రావణ ఖడ్గం
సింధూర ఛాయను అద్దుకుంది

పీకలు కోసే కాలాన్ని దాటి
ఊపిరి పోసుకున్న శైశవాన్ని పట్టి
కుప్పతొట్టి పీక నులుముతుంటే
ఆడుతూ పాడుతూ అక్షరాలను
దిద్దుకుంటున్న బాల్యాన్ని వెంటాడి
కార్పోరేటు కారాగారం బంధించింది

వలువలు విప్పుకొన్న నాగరికత
మేధకు రోబోటు రూపాన్ని తొడిగి
చూపుల పెదవులను కత్తిరిస్తుంటే

పూల నవ్వుల్ని ఏరుకుంటున్న హృదయం
గద్దను చూచిన కోడిపిల్లలా
జ్ఞాపకాలను జారవిడుచుకొని
శాశ్వతంగా మూగవోయింది

బంధాలను తెంచుకున్న ఆశలు
డాలర్ గాలానికి చిక్కాని
పోతున్న ప్రాణాన్ని
చేతపట్టుకొన్న
చేపపిల్లల్లా రోదిస్తున్నాయి

కొత్త రంగుల్ని మోహానికి రాసుకున్న
కళ్ళుండి చూడలేని దృతరాష్ట్రనీతి
శాంతికపోతం గుండెల్లోకి కత్తులు దించితే
క్షతగాత్రమైన దేహంతో
పలువరించింది రెక్కలు తెగిన స్వేచ్ఛ.



# అమెరికా తెలుగు కథాసాహిత్యం

దెబ్బయ్యో దశకం నాటికి అమెరికాకు వచ్చే తెలుగువారి సంఖ్య క్రమంగా పెరగడంతో అక్కడి ముఖ్య నగరులన్నింటిలోను తెలుగు సంఘాలు ఏర్పడటం, ఆ తరువాత ఆ సంఘాలే చిన్నవో, పెద్దవో లిఖిత పత్రికలు ప్రచురించడం ఆరంభమైంది. ఆ తరువాత కొంతకాలానికి అచ్చు పత్రికలు కూడా వెలువడ్డాయి. తెలుగు భాషా పత్రిక, మధురవాణి, తెలుగు అమెరికా పత్రికల్లో ఇక్కడున్న తెలుగు కథకుల కథలు ప్రచురించబడేవి. తొంబయ్యో దశక ప్రారంభంతో వెలువడిన తానాపత్రిక, ఆ తరువాత కొంతకాలానికి వెలువడిన అమెరికా భారతి, తెలుగు జ్యోతి, తెలుగు వెలుగు, తెలుగు పలుకు, ఇంద్ర ధనస్సు, తెలుగువాణి పత్రికలు వెలుగుచూసాయి. ఈ పత్రికలన్నీ తెలుగు కథకు అగ్రతాంబూలాన్ని ఇచ్చాయి.



**డాక్టర్ తన్నీరు కళ్యాణ్ కుమార్**

✆ 09490776385

కథలు వ్యక్తుల జీవితానుభవాల్లోంచి పుట్టి, ఆ జీవితాలనే ప్రతిబింబిస్తుంటాయి. అమెరికాంధ్రుల జీవితాలలో తరచు తారసపడే పరిస్థితులను, సమస్యలను వాటి పరిష్కారాలను కథలుగా మలిచి మనకు అందిస్తున్న కథకులు అభినందనీయులు. వేరు వేరు కాలాలలో అమెరికాలోని తెలుగువారి జీవనవిధానం ఎలా కొనసాగిందో తెలుసుకోవడం ఈ కథల ద్వారానే సాధ్యమవుతుంది. అమెరికాలోని తెలుగు కథకులు అక్కడి సమాజంలోని తమ వారి జీవితాలను శోధించి, ఆ అంశాలనే ఇతివృత్తాలుగా తీసుకొని కథలను సృష్టిస్తున్నారు.

చరిత్రగతిని పరిశీలిస్తే విదేశాలకు వలసపోయిన ప్రవాసులందరూ తమదైన భాష, సంస్కృతి, మతం పట్ల విపరీతమైన మమకారాన్ని కలిగివుండటం అనేది అత్యంత సహజమైన విషయం. అమెరికాలాంటి భిన్న సంస్కృతుల వ్యవస్థలో తమ సంస్కృతిని, తమ భాషను, తమ ప్రత్యేకతను నిలబెట్టుకోవాలనే తాపత్రయంతోను ఉత్సాహంతోను అక్కడి కథారచయితలు కథలను సృజిస్తున్నారు. అమెరికా తెలుగు కథలన్నింటిలోను తాత్త్వికాంశానికి సంబంధించిన గాఢత వుంది. సాహిత్యం కూడా సంస్కృతిలో భాగం కావున అమెరికాలో స్థిరపడినప్పటికీ మాతృభాషలో కథలు, కవితలు వ్రాసే రచయితలు కూడా అక్కడి తెలుగు సంస్కృతికి ఇతోధిక సాయం చేస్తున్నట్లుగా చెప్పవచ్చు.

అమెరికాంధ్ర సాహిత్యంలోని కథలన్నీ అక్కడి తెలుగువారి జ్ఞాపకాల నుండి, ఆరాటాల నుంచి, బెంగల నుంచి, స్పృశించిపోయే అనుభవాల నుండి పుట్టుకొచ్చాయి. అక్షరాల ఈ కథలు ప్రస్తుతం తెలుగుగడ్డపై పుడుతున్న కథలకు ఇవి భౌతికంగాను, మానసికంగాను భిన్నమైనవి. సామాజిక అభద్రతా ఇతివృత్తాల కంటే, 'ఐడెంటిటీ' సమస్యలు ఎక్కువగా తాకే కథలే అధికంగా కన్పిస్తాయి. అట్లే ఈ కథలలో అధిక భాగం కథలు స్త్రీ దృక్పథం నుండి కష్టసుఖాలను విశదం చేస్తాయి. అమెరికాలోకి తెలుగు రచయితలందరూ రచనే వృత్తిగా కలిగినవారు కాదు. అక్కడి రచయితలకిది ప్రవృత్తి మాత్రమే. ఈ రచయితలకు వారు చేసే ఉద్యోగాల ద్వారా రకరకాల వ్యక్తులు పరిచయమవుతుంటారు. అట్టివారు ఆ అమెరికాగడ్డపై ఎటువంటి సమస్యలను ఎదుర్కొంటున్నారో, వాటిని వారు ఎలా పరిష్కరించుకోగలుగుతున్నారో, ఆయా సమస్యల నుండి బయటపడే దారిలేక ఎలా బలిఅవుతున్నారో తెలుసుకొని కూర్చబడిన కథలివి.

అమెరికా తెలుగు కథా పరిణామాన్నే అమెరికా తెలుగు సాహిత్య పరిణామంగా చెప్పవచ్చు. అమెరికాలో తెలుగు కథ పుట్టు పూర్వోత్తర వికాసాలను పరిశీలిస్తే 1965 ప్రాంతపు తొలిదశలో అమెరికా గడ్డపై కాలుమోపిన తెలుగువారు, ఆ సరికొత్త వ్యవస్థలో సర్దుకుపోలేక విపరీతమైన ఒత్తిళ్ళకులోనై సాహిత్యం జోలికిపోలేదు. కానీ 1970 ప్రాంతంలో ఈ పరిస్థితులు మారి సాహిత్య సృజనకు అనుకూలమైన వాతావరణం ఏర్పడింది. దీంతో అంతకముందు రచనా వ్యాపకం కలిగిన వారేగాక కొత్తవారు కూడా కలంపట్టి తమ సంఘర్షణలను కథలుగా మలచడం ఆరంభించారు.

తొలిదశలో అక్కడికి వచ్చినవారు వేరు వేరు సంవత్సరాలలో రావడం చేతను, వేరు వేరు ప్రాంతాలలో స్థిరపడటంచేతను, మొదటిలో వారి మధ్య పరిచయాలు అంతగా లేకపోవడంచేతను అమెరికాలో వెలువడిన తొలికథ ఏది? తొలి కథకులు ఎవరు? అనే ప్రశ్నలకు స్పష్టమైన సమాధానం చెప్పడం వీలు కాదు. ఇదమిద్ధంగా అమెరికాలో తొలి తెలుగుకథ 1962–65 ప్రాంతంలో వెలుగు చూసి ఉండవచ్చునని అక్కడ రచయితల అభిప్రాయం. 1964లో ఆంధ్రప్రభలో ప్రచురితమైన పులిగండ్ల మల్లిఖార్జునరావు 'వారాహి' కథ అమెరికా నుండి వెలువడిన తొలి తెలుగు కథ అని అక్కడి కొందరి రచయితల అభిప్రాయం.

డెబ్భయ్యో దశకం నాటికి అమెరికాకు వచ్చే తెలుగువారి సంఖ్య క్రమంగా పెరగడంతో అక్కడి ముఖ్య నగరులన్నింటిలోను తెలుగు సంఘాలు ఏర్పడటం, ఆ తరువాత ఆ సంఘాలే చిన్నవో, పెద్దవో లిఖిత పత్రికలు ప్రచురించడం ఆరంభమైంది. ఆ తరువాత కొంతకాలానికి అచ్చు పత్రికలు కూడా వెలువడ్డాయి. తెలుగు భాషా పత్రిక, మధురవాణి, తెలుగు అమెరికా పత్రికల్లో ఇక్కడున్న తెలుగు కథకుల కథలు ప్రచురించబడేవి. తొంబయ్యో దశక ప్రారంభంతో వెలువడిన తానాపత్రిక, ఆ తరువాత కొంతకాలానికి వెలువడిన అమెరికా భారతి, తెలుగు జ్యోతి, తెలుగు వెలుగు, తెలుగు పలుకు, ఇంద్ర ధనస్సు, తెలుగువాణి పత్రికలు వెలుగుచూసాయి. ఈ పత్రికలన్నీ తెలుగు కథకు అగ్రతాంబూలాన్ని ఇచ్చాయి.

వంగూరి చిట్టెన్‌రాజు, సత్యం మందపాటి, పెమ్మరాజు వేణుగోపాలరావు, రఘునాథ్, వేమూరి వెంకటేశ్వరరావు తదితరులు అమెరికాలోని ప్రారంభ తొలికథకులు. తొలితరం రచయితలు మొదట్లో పుట్టిన గడ్డకు దూరంగా వుండటంవల్ల ఆ జ్ఞాపకాలను, అనుభూతులను ఒకరితో మరొకరు పంచుకోవలనుకున్నారు. కావునే తొలితరం కథకుల కథలలో నాస్టాల్జియా భావాలు కన్పిస్తాయి. అనేక సంవత్సరాలుగా ఈ రచయితలు భౌతికంగా అమెరికాలో ఉన్నప్పటికీ తమ మూలాన్ని మాత్రం మర్చిపోలేదు. వీరి చేతి నుండి జాలువారే ప్రతి రచనలోను మాతృదేశంతో వాళ్ళకున్న మానసిక సాన్నిహిత్యం కనిపిస్తుంది. దామరాజు లక్ష్మి, శాంతి శారదాపూర్ణ లాంటి వాళ్ళు పూర్తిగా మాతృదేశపు జ్ఞాపకాలతో కథలను సృజించారు.

1990 సంవత్సరం తరువాత వచ్చిన రెండోతరం కథకుల కథల్లో నాస్టాల్జియా భావనలు కనిపించుట లేదు. కొత్తదేశంలో తమకు ఎదురయ్యే సరికొత్త అనుభవాలను, పాత అనుభవాలను సమన్వయం చేస్తూ, ప్రతి విషయాన్ని కొత్త కళ్ళతో పరిశీలిస్తూ వ్రాసే డైస్పోరా కథాసాహిత్యం వెలువడటం మొదలయింది. 1998 అట్లాంటాలో జరిగిన ప్రప్రథమ తెలుగు సాహితీ సదస్సు 2000 చికాగోలో జరిగిన రెండవ అమెరికా తెలుగు సాహితీ సదస్సు ఈ భావనలకు బలాన్ని ప్రసాదించింది.

ఉత్తర అమెరికాలోని తెలుగు రచయితలను ప్రోత్సాహించి తెలుగు భాషా పోషణకి దోహదం చేసే సదుద్దేశ్యంతో 1994లో ఏర్పడిన వంగూరి ఫౌండేషన్ ఆఫ్ అమెరికా తెలుగు కథకు రాజ గౌరవాన్ని కలుగజేసింది. ఈ ఫౌండేషన్ కృషితోనే 1995 జులైలో అమెరికా తెలుగు కథానిక మొదటి సంకలనం వెలుగు చూసింది. అమెరికాలో వెలువడిన మొట్టమొదటి కథా సంకలనం కూడా ఇదే కావడం విశేషం. ఈ ఫౌండేషన్ వారే ఏటేటా కథా పోటీలను నిర్వహించి బహుమతులు ఇవ్వడమే గాక, కథా సంకలనాలుగా కూడా ప్రచురిస్తున్నారు. పెమ్మరాజు వేణుగోపాలరావు గారి సంపాదకత్వంలో ఈ ఫౌండేషన్ వారు ఇప్పటి వరకు 13 కథా సంకలనాలను ప్రచురించారు.

అమెరికాలోని తెలుగు రచయితల సృజనాత్మక శక్తి వెలికితీయుడంతోను, ఔత్సాహిక కథకులను ప్రోత్సాహించి ఉత్సాహపరచడంతోను ఈ ఫౌండేషన్ గణనీయమైన పాత్ర పోషించిందని నిస్సందేహంగా చెప్పవచ్చు. పై సంకలనాతో పాటుగా దామరాజు సచ్చిదానందమూర్తి గారి 'మాఊరి కథలు' చిమటకమల గారి 'అమెరికా ఇల్లాలు', వేమూరి వెంకటేశ్వరరావు గారి 'మెటామార్ఫసిస్' పూడి పెద్దిశేషు శర్మగారి 'ప్రవాసాంధ్రుల ఆశాకిరణం' మొదలైన కథాసంకలనాలను కూడా వంగూరి ఫౌండేషన్ వారు ప్రచురించి ఇక్కడి కథకులను ప్రోత్సాహించారు.

1995 సంవత్సరంలోనే సత్యం మందపాటి గారి 'అమెరికా బేతాళకథలు' అనే కథా సంపుటి వెలువడింది. తెలుగువాడు పై కొస్తున్నాడు – తొక్కేయండి, చెట్టుక్రింద చినుకులు, గవర్నమెంటాలిటీ కథలు – మేడ్ ఇన్ అమెరికా, ఎన్నారై కథలు, మరో ఆరు అమెరికా కథలు మొదలైనవి సత్యం మందపాటి గారి ఇతర కథా సంకలనాలు. ఈ విధంగా కొందరు కథకులు తమ కథా సంకలనాలను తామే ప్రచురించుకొని కథలపై తమకున్న అభిలాషను వ్యక్తపరుస్తున్నారు.

1977 నుంచి జరుగుతున్న ద్వైవార్షిక 'తానా' సమావేశాలు – 1991 నుండి జరుగుతున్న 'ఆటా' సమావేశాలు – ఈ మధ్యే జరుపుకుంటున్న అనేక తెలుగు సంఘాల రజతోత్సవాలు ఆ రజతోత్సవాలు సందర్భంగా ప్రత్యేక సంచికలు ప్రచురించడం ఆనవాయితీ అయింది. ఈ పత్రికలు, ప్రత్యేక సంచికలు కూడా వీలయినంత వరకు అమెరికాలోని తెలుగు కథకులను ప్రోత్సహిస్తున్నాయి. అమెరికాలోని తెలుగు రచయితలు చాలా మంది తెలుగుదేశపు పత్రికల్లో తమ రచనలను ప్రచురిస్తూ మంచిపేరు తెచ్చుకుంటున్నారు. ఇవన్నీ కలుపుకుంటే అమెరికాంధ్రులు సృష్టించిన తెలుగు సాహిత్యం రాశిపరంగా గణనీయంగానే వుంది. ఈ సాహిత్యంలో అధికభాగాన్ని కథలే ఆక్రమించాయి.

అమెరికా తెలుగు కథలన్ని ప్రచురితమైన క్రమంలో పరిశీలిస్తే మొదటి తరం అమెరికా తెలుగు కథల్లో ముఖ్యంగా కనిపించేది కల్చర్ షాక్ కథలు. కల్చర్‌షాక్ కథలు తర్వాత నెమ్మదిగా అమెరికా తెలుగు జీవనానికి సంబంధించిన కథలు రావటం మొదలైనాయి. పిల్లల పెంపకంలో ఉండే ఇబ్బందులు, మారుతున్న భార్య, భర్తల అనుబంధాలు, పిల్లల పెళ్ళిల విషయంలో ఎదురౌతున్న అవస్థలు, అమెరికాలో అతిథులతో ఇబ్బందులు, అమెరికా నుండి ఇండియాకి వెళ్ళినప్పుడు కలిగే అనుభవాలు కథా వస్తువులయినాయి. ఆ తరువాత విడాకులు, వృద్ధాప్యం, ఉద్యోగ విరమణ వస్తువులుగా కథలు వచ్చాయి. ఇప్పటికీ వస్తున్నాయి. అమెరికా తెలుగు కథలు చాలా వరకు తెలుగు పాత్రలకు, తెలుగు కుటుంబాలకే పరిమితమైనట్లుగా కనిపిస్తున్నాయి. అమెరికన్ పాత్రలు, అమెరికన్ ప్రపంచం ఈ కథలలో అరుదుగా కనిపిస్తాయి.

కథలలోని ఇతివృత్తాలను ఆధారం చేసుకొని అమెరికా తెలుగు కథలను కొన్ని రకాలుగా వర్గీకరించవచ్చు.

**1) అమెరికన్ సంస్కృతి పట్ల అవగాహన కలుగజేసే కథలు :–** అమెరికాకు వెళ్ళబోయే తెలుగువారికి అక్కడి పద్ధతులను సాంప్రదాయాలను తెలియజెప్పాలని ప్రయత్నాన్ని కొందరు కథకులు చేసారు. అలాంటి కథకుల్లో సత్యం మందపాటి సుప్రసిద్ధులు. సత్యం మందపాటి వ్రాసిన 'అమెరికా బేతాళకథలు', 'ఎన్నారైకథలు', మొదలైన

కథా సంకలనాలు అమెరికాకు వెళ్ళబోయేవారికి దిక్సూచిలు వంటివి. ఈ కథలు కొత్తగా అమెరికాకు వచ్చేవారికి కొంత మార్గదర్శకత్వాన్ని ఇస్తాయనుటలో సందేహంలేదు. ఈ కథలు అమెరికాలోని తెలుగువారికి జీవనశైలిని, వారి సమస్యలను, పాఠకులకు పరిచయం చేస్తాయి.

**2) అమెరికా హాస్య కథలు :-** అమెరికా తెలుగు కథాసాహిత్యంలో హాస్య కథలకు ఒక ప్రత్యేక స్థానం ఉంది. అమెరికా జీవనంలో తమకు ఎదురైన అనుభవాలకు, సంఘటనలకు హాస్యాన్ని జోడించి కొందరు కథకులు కథలను సృజియించారు. ఈ కథలు పాఠకులకు హాస్యాన్ని అందిస్తూనే అప్పుడప్పుడు సందర్భోచితంగా చురకలు అంటిస్తుంటాయి. వంగూరి చిట్టెన్ రాజు గారి 'అమెరికా కామెడీ కథలు' ఈ కోవకు చెందినవే.

**3) తరాలమధ్య సంఘర్షణలను చిత్రించిన కథలు :-** భారతదేశంలో పుట్టి పెరిగి అమెరికాకు వెళ్ళి స్థిరపడిన భారతీయ తొలితరానికి. అమెరికాలోని స్థిరపడిన భారతీయ కుటుంబాలలో పుట్టి పెరిగిన రెండవ తరానికి అనేక విషయాలలో వ్యత్యాసం కనిపిస్తుంది. ఒకే కుటుంబంలో ఉండే ఈ రెండు భిన్నతరాల మధ్య విద్య – సంస్కృతి – వివాహ తదితర విషయాలలో అనేక భేదాలు పొడచూపుతున్నాయి. ఈ రెండు తరాల వ్యక్తుల మానసిక సంఘర్షణలను కొన్ని కథలు చిత్రించాయి. పూడిపెద్ది శేషుశర్మ 'అభాసులు –అభాతలు', 'నిర్ణయం', 'పదహారేళ్ళ వయసు' 'సంఘర్షణ', 'దృక్పథం', నోరి రాధిక – 'విలువలు', 'కాగల కార్యం గంధర్వులే తీర్చారు', మాచిరాజు వెంకటరత్నం 'సంధ్యావందనం, మొ॥ కథలు ఈ కోవకు చెందినవి.'

**4) వివాహ సమస్యలను చిత్రించిన కథలు :-** అమెరికాంధ్రులు ఎదుర్కొంటున్న సమస్యలలో వారిపిల్లల వివాహ సమస్య వారిని ఎంతగానో వేధిస్తుంది. అందులోను 'ఆడపిల్లల వివాహ విషయంలో ఈ సమస్య అనేది మరింత జఠిలంగా మారింది. అమెరికాంధ్రుల వివాహ సమస్యను కేంద్రంగా తీసుకొని అక్కడి తెలుగు కథకులు తమ తమ దృక్కోణాల్లో కథలను తీర్చిదిద్దారు, పూడిపెద్ది శేషుశర్మ 'అన్వేషణ', 'పెళ్ళి చేసుకుంటే చూడు', సుధేష్ణ 'మొగుడు కావాలా', సత్యం మందపాటి 'తూర్పు పడమర', జొన్నాళ్ లలితా 'పి.పి అమ్మ' ఈ కోవకు చెందినవి.

**5) వృద్ధాప్య సమస్యలను చిత్రించిన కథలు :-** అమెరికాకు తరలిపోయిన తొలితరం వారు ఎదుర్కొంటున్న సమస్యల్లో ప్రధానమైనది వృద్ధాప్యపు ఒంటరితనం. అమెరికా తెలుగు కథాసాహిత్యం అక్కడి ఒంటరి వృద్ధాప్య హృదయాల లోతులను కూడా చక్కగా ఆవిష్కరించింది. పూడిపెద్ది శేషుశర్మ 'చిరుదీపం', 'ముసురు చీకట్లో మెరుపు కిరణం', 'వానప్రస్థాశ్రమం', సత్యం మందపాటి 'మధ్యాహ్నం' కథలు ఈ కోవలోనివి.

**6) మధ్య వయస్సు ఒంటరితనానికి పరిష్కారం చూపిన కథలు :-** అమెరికాలో స్థిరపడిన భారతీయ కుటుంబాలలోని కొందరు వ్యక్తులను వేధిస్తున్న సమస్యల్లో మధ్య వయస్సు ఒంటరితనం ఒకటి. మధ్యవయస్సు ఒంటరితనానికి పరిష్కారం చూపుతూ అమెరికా తెలుగు కథాసాహిత్యంలో కొన్ని కథలు వెలువడ్డాయి. ఈ కథలలో చాలా కథలు ఈ సమస్యకు పరిష్కారంగా పునర్వివాహాన్ని సూచించాయి. పూడిపెద్ది శేషుశర్మ 'ఎండమావులు', 'కొత్తగా రెక్కలొచ్చెనా' 'అనుబంధం', నోరి రాధిక – 'న్యాయం', 'అకాల వసంతం', సుధేష్ణ – 'చైతన్యం', తాడికొండ శివకుమారశర్మ 'స్టిల్‌ఏన్ ఇండియన్', మొదలైనవి.

**7) విభిన్న సంస్కృతుల వివాహ సమస్యలను చిత్రించిన కథలు :-** వేర్వేరు దేశాలలో, వేర్వేరు సంస్కృతులలో పుట్టి పెరిగిన ఇద్దరు వ్యక్తులు వివాహం ద్వారా ఒకటయితే వారి మధ్య తలెత్తే సమస్యలను గూర్చి ఆ సమస్యలను పరిష్కరించుకోవాల్సిన తీరును గూర్చి, కలిసిమెలిసి జీవించాల్సిన ఆవశ్యకతను గూర్చి కొన్ని కథలు వివరించాయి. యార్లగడ్డ కిమీర 'వీడిన నీడలు', సాయి లక్ష్మి 'ఒయ్యారం', సత్యం మందపాటి 'మేడ్ ఇన్ అమెరికా', రాణీ సంయుక్త 'వంచన' ఈ కోవకు చెందిన కథలు.

**8) భార్యభర్తల అనుబంధాలను చిత్రించిన కథలు :-** అమెరికాలాంటి విదేశాలకు వెళ్ళినప్పుడు భార్యభర్తల బాధ్యతలు మరింత పెరుగుతాయి. దేశంకాని దేశంలో భార్య – భర్తల మధ్య ఉండాల్సిన ప్రేమానురాగాలను గూర్చి, బాధ్యతలు పంచుకోవాల్సిన తీరును గూర్చి, సర్దుకుపోవాల్సిన ఆవశ్యకతను గూర్చి కొన్ని అమెరికా తెలుగు కథలు తెలిపాయి. పూడిపెద్ది శేషుశర్మ 'సర్‌ప్రైజ్', 'అగాధం', గొర్తి బ్రహ్మానందం – 'స్వేచ్ఛ', అయ్యగారి రమామణి 'కల నుండి ఇలకు', పుచ్చా అన్నపూర్ణ 'పెళ్ళి', కనకదుర్గా 'హెన్‌పెక్డ్', విజయశ్రీ 'దాంపత్యానికి అనుబంధం', పుట్లా విప్లవ్ 'ఎనైట్ అన్‌ద సిక్స్త్ స్ట్రీట్'.

**9) గృహహింసను చిత్రించిన కథలు :-** లక్షల కట్నాలు కుమ్మరించి సంపాదించుకున్న భర్తలు తమకు రక్షణ ఇవ్వకపోగా మానసికంగాను, శారీరకంగాను హింసలకు గురి చేస్తుంటే పరాయి దేశంలో తమ బాధలను పంచుకునే వారు లేక, స్వదేశంలోని తల్లిదండ్రులకు చెప్పుకోలేక మూగ బాధను అనుభవిస్తున్న గృహిణులను కేంద్రంగా చేసుకొని అమెరికా తెలుగు సాహిత్యంలో కొన్ని కథలు వెలువడ్డాయి. కొవ్వలి జ్యోతి– 'తరతరాల కథ' సత్యం మందపాటి 'మరణ ముహూర్తం', 'రామేశ్వరం పోయినా', పూడిపెద్ది శేషుశర్మ 'చీకటి వెలుగులు' మొ॥.

**10) అమెరికన్ సంస్కృతిలో మమేకం కాని జీవితాలను చిత్రించిన కథలు :-** భారతీయ వాతావరణంలో పుట్టిపెరిగిన వ్యక్తులు అమెరికాకు వచ్చినప్పుడు అక్కడి వ్యవస్థకు, పద్ధతులకు అలవాటు పడటానికి ప్రారంభంలో కొన్ని ఇబ్బందులు పడతారు. ఐతే రెండు మూడు సంవత్సరాలు గడిచిన తరువాత వారు కూడా ఆసమాజానికి అలవాటుపడి, అక్కడి పరిస్థితుల్లో మమేకమైపోతారు. మరికొంత మంది స్వదేశంలోని తమవారికి దూరంగా ఉండలేక అక్కడి వాతావరణానికి – పద్ధతులకు ఇమడలేక ప్రవాస భేదాన్ని అనుభవిస్తుంటారు. ఇలాంటి వ్యక్తుల జీవితాలను, వారి ఆలోచనల లోతులను వెల్లడించిన కథలు కొన్ని అమెరికా తెలుగు కథా సాహిత్యంలో ఉన్నాయి. దశిక శ్యామలదేవి 'జానకి' వేలూరి వి.ఆర్ 'మెటమార్ఫసిస్' చిమట కమల 'అమెరికా ఇల్లాలు', శార్వరి 'తప్పెవరిది', రాధికాశాస్త్రి 'జీవన వాహిని'.

**11) అమెరికా విద్యావిధానంపట్ల అవగాహన కలిగించు కథలు :-** పాఠ్య ప్రణాళికలలోను, బోధనలోను, పరీక్ష విధానంలోను భారతీయ విద్యా విధానానికి అమెరికా విద్యా విధానానికి ఎంతో తేడా వుంది. అమెరికన్ విద్యా విధానంలోని విశేషాలను కథల రూపంలో

అందించే ప్రయత్నం కొందరు కథకులు చేసారు. ఆరి సీతారామయ్య – 'వెలుతురు', 'పై చదువు', యర్రమిల్లి దుర్గా 'జీవిత చక్రం' మొ॥ ఇత్యాది కథలు.

**12) మాతృభూమి పట్ల మమకారాన్ని వెల్లడించే కథలు :-** 'జనని జన్మభూమిశ్చ స్వర్గాదపీ గరీయసీ' అనే సూక్తిని ప్రవాస భారతీయులు మరువలేదు. వ్యక్తులుగా వారు అమెరికాలో ఉన్నప్పటికీ, వారి మనస్సు మాత్రం మాతృదేశంలోనే ఉంటుంది. మాతృభూమిని ప్రేమించటలోను, జాతీయ భావాలు కలిగి ఉండుటలోను స్వదేశంలోని భారతీయులకు వీరు ఏమాత్రం తీసిపోరు మాతృభూమిపట్ల తమకున్న అభిమానాన్ని అక్కడున్న తెలుగు కథకులు తమ కథలలో వ్యక్త చేసారు. మాచిరాజు సావిత్రి 'పాస్‌పోర్ట్', పూడిపెద్ది శేషశర్మ లోభి', సత్యం మందపాటి 'వసుధైక కుటుంబం', కొమరవోలు సరోజ 'ఏ కథ వ్రాయాలి?', వడ్లమూడి విశ్వనాథ్ 'మామిడిపండు', వేదుల చిన్న వెంకటచయనులు 'మనుసొక చోట – మనుగడ మరోచోట' మొ॥

**13) సాంస్కృతిక ఔన్నత్యాన్ని వెల్లడించిన కథలు :-** పరాయిగడ్డ పై సొంత సంస్కృతిని నిలబెట్టుకోవాల్సిన ఆవశ్యకతను వివరిస్తూ అమెరికా తెలుగు కథా సాహిత్యంలో కొన్ని కథలు వెలువడ్డాయి. ఒకతరం నుండి మరొక తరానికి సంస్కృతిని అందించాల్సిన ఆవశ్యకతను గూర్చి ఈ కథలు నొక్కి చెప్పాయి. నిడదవోలు మాధవి 'ఉభయ భాషా ప్రవీణ' పూడిపెద్ది శేషశర్మ 'ఆశాకిరణం', 'ఉగాది పచ్చడి', దేశభొట్ల ఉమ 'చేతులు కాలాక ఆకులు', సత్యం మందపాటి 'ఫోర్ ఏంగిల్స్ ఆఫ్ ఎ ట్రాయాంగిల్'

**14) స్వదేశంలోని బంధుప్రేమలను వివరించు కథలు :-** స్వదేశంలోని రక్త సంబంధీకులు, బంధువులు తమను కేవలం వారి అవసరాలను తీర్చే కల్ప వృక్షాలు భావిస్తున్నారనే నిరసన ఇక్కడి కొన్ని కథలలో అమెరికాలో తామేదో డాలర్లలో మునిగి తేలుతున్నామని అనుకుంటారే తప్ప, తమకు కష్టనష్టాలు ఉంటాయని వారు ఏమాత్రం గ్రహించడంలేదనే ఆవేదన ఈ కథలలో వ్యక్తమవుతుంది. అట్లే కొన్ని కథలు స్వదేశంలోని స్వచ్ఛమైన ప్రేమలను గూర్చి కూడా వివరించాయి. కొమరవోలు సరోజ 'ఉష్ణశీతల', నోరి రాధిక 'ఆట', కె.వి. గిరిధర్‌రావు 'హల్లో... శంకరం', కన్నెగంటి చంద్ర 'బతుకు'.

పైన పేర్కొన్న ఇతి వృత్తాలతోనే కాక, అమెరికాలోని తెలుగువారి జీవన ప్రవంతిలోని భిన్న పార్శ్వాలను ఆవిష్కరిస్తూ మరెన్నో కథలు వెలువడ్డాయి, వెలువడుతున్నాయి.

అమెరికన్ ఇమిగ్రేషన్ నియమాలలో మార్పులు వచ్చాక, తెలుగువారు అమెరికాకు వెళ్ళడం ఆరంభమైయింది. ఈ మూడు దశాబ్దాలలో వీరు జీవితాలలో వచ్చిన మార్పులు అవగాహన చేసుకోవడానికి కావలసిన వస్తువులు పూర్తిగా అందుబాటులో లేవు. వీటిని సంగ్రహించి, విశ్లేషించి ప్రకటించే పరిశోధకులు ఇంకా బయలుదేరలేదనే చెప్పాలి. ఈ కొరతను కొంత వరకు అమెరికా తెలుగు కథా సాహిత్యం తీర్చిందనుటలో ఎట్టి సందేహం లేదు.

1975 ప్రాంతంలో అమెరికాలోని తెలుగు కథ పుట్టిందనుకొంటే నాటి నుండి నేటి దాక ఎందరో కథకులు తమ కథలతో అమెరికా తెలుగు కథా సాహిత్యాన్ని పరిపుష్టం చేశారు. నేడు తెలుగుదేశంలోని మధ్య తరగతి కథాభిమానులకు అమెరికా తెలుగు కథ పరాయిదిగా అనిపించదు. తెలుగు కథా సాహిత్యంలోకి చనువుగా కష్టసుఖాలను, చెప్పుకుంటూ పలకరించవచ్చిన అమెరికా తెలుగు కథ తెలుగువారికి పరాయిదేమికాదు. కావున అమెరికా తెలుగు కథను మాతృదేశం కూడా ఆదరించాల్సి ఉంది.

30 ఏళ్ళ నాటి అమెరికాకు, 2001 సెప్టెంబర్ 11 తరువాత అమెరికాకు చాలా తేడా ఉంది. ఈ తేడాను తమ కథల్లో బలంగా చూపించిన కథకులు చాలా తక్కువ సంఖ్యలో ఉన్నారు. అమెరికా తెలుగు రచయిత్రులలో చాలా మంది తెలుగు జీవనానికి సంబంధించిన కుటుంబిక ఇతి వృత్తాలతోనే కథలు వ్రాసారే తప్ప, వర్తమాన సాంఘిక – రాజకీయ ఆర్థిక విషయాలను స్పృశించినట్లు కనిపించుటలేదు. అంతేగాక నేడు కొత్తగా పుట్టుకొస్తున్న వివాహ వేదికలు, ఆన్‌లైన్ మ్యారేజ్ బ్యూరోలవంటి అంశాలపై కూడా అమెరికా తెలుగు కథ దృష్టి సారించునట్లు కనిపించుటలేదు. ఎన్నారైల కట్నం వేధింపులను చిత్రిస్తూ వచ్చిన కథలు కూడా చాలా తక్కువ సంఖ్యలోనే ఉన్నాయి.

అమెరికా తెలుగు కథకులు కథ, ఎత్తుగడ, ముగింపు, భాష, శైలి వంటి విషయాలపట్ల కొంత శ్రద్ధ చూపించవలసిన అవసరం ఎంతైనా ఉంది. స్థానిక సంపాదకులు కూడా కథల ఎన్నిక విషయంలోనూ, రచనలలోని లోటు పాట్లను సవరించడంలోను కొంత శ్రద్ధ వహిస్తే బాగుంటుంది. అమెరికా తెలుగు కథకులు కొంచెం శిల్పంపై పట్టు సాధిస్తే మరింత మన్నికైన కథారత్నాలు వెలువడుతాయి. అయితే ఇంతకు ముందు పరిస్థితి ఎలా ఉన్నా, ఈ మధ్యకాలంలో వ్రాస్తున్న కొన్ని కథలు ముఖ్యంగా కొత్తగా వ్రాస్తున్న కథకులు కొందరిలో వస్తువులోనూ శిల్పంలోనూ వైరుధ్యం చూపాలన్న తపన స్పష్టంగా కనిపిస్తుంది. అంతేగాక వీరు తమ కథలపై చర్చలనూ, విమర్శలనూ, ఆహ్వానించడం ఒక శుభపరిణామం.

ఆంధ్రదేశంలోని కథానిలయంలా, అమెరికా తెలుగు కథలన్నీ ఒకేచోట లభ్యమయ్యే ప్రయత్నాన్ని అక్కడి తెలుగు సంఘాలవారు, ఫౌండేషన్‌లవారు కృషిచేస్తే బాగుంటుంది. వంగూరు పౌండేషన్ వారు డైస్పోరా సాహిత్యాన్ని సంకలనాలుగా తీసుకొచ్చే బృహత్ కార్యాన్ని నిరాటంకంగా చేస్తుండుట వల్ల కొంతన్నా అమెరికాంధ్ర కథా సాహిత్యం ఒకే చోట లభ్యమౌతుంది. ఈ ప్రచురణలే లేకపోతే నేడు చాలామంది రచయితల కథలు ప్రత్యేక సంచికలలో తప్ప లభ్యమయ్యేవి కావు. వెబ్‌సైట్స్‌లలో వెలువడుతున్న అమెరికాంధ్రా కథ సాహిత్యాన్ని కథా సంకలనాలుగా తీసుకొచ్చే ప్రయత్నం చేస్తే బాగుంటుంది. ఇప్పటికే ఈ ప్రయత్నాన్ని 'ఈమాట' వెబ్‌సైట్ వారు చేపట్టడం శుభాదాయకం.

తెలుగు సాహిత్యంలో అమెరికాంధ్ర కథాసాహిత్యమనేది ఓ పాయ. దళిత, మైనార్టీ ఉద్యమాలలో భాగంగా అమెరికాంధ్ర జీవితం గురించి అమెరికాలోనూ స్వదేశంలోను సరైన చర్చ జరిగినప్పుడే వర్తమాన తెలుగు సాహిత్య స్వరూపం మరింత స్పష్టమవుతుంది. అమెరికాంధ్ర సాహిత్యంలోని మిగిలిన ప్రక్రియల పై కూడా మరెన్నో పరిశోధనలు రావాలి.

రచయిత సెల్ : **9490776385**

## వేయి పడగల నాగు

రామిశెట్టి రోశయ్య
✆ 9390279127



వేయి పడగల నాగురా అమెరికా
కుట్రలకు పుట్టిల్లురా,

ఇది నాలుకలు చాచింది
బుసలనే కొట్టింది, దేశాలపై
విషమునే చిమ్మిందిలా! వేయిపడగల!

ఈరాక్ అధిపతి సద్దాంతో
గిల్లి తగవునే రేపింది రా
ఆయిల్‌ను కాజేయ నెపములెన్నో చూపి
బాంబులతో దాడులే చేసిందిరా ॥వేయి॥

పాప మెరుగని ప్రజల ప్రాణాలు
పసి పాలని కూడ యెంచకుండానే
దేశాన్ని మట్టిపాల్ చేసింది రా ॥వేయి॥

ఈరాన్ దేశాన్ని, అణుబాంబులున్నవని,
లొంగి రమ్మని తాఖీదు పంపింది రా!
అష్టదిగ్బంధనం చేసి అణచి
ఉంచాలని చూస్తుంది రా ॥వేయి॥

అమెరికా సేవలో ఆరితేరిన వాడు,
గురువు కోరిక తీర్చ దేశాని కొచ్చాడు
పదవులే చేపట్టి, పసిడి మాటల తోటి
మన దేశ ప్రధాని, అమెరికా ఉచ్చులో
దింపిందురా! ॥వేయి॥

మనదేశ శ్రామికులు "పరపంచ పొత్తులు"
మాకొద్దు అని పొలికేకలే వేయ ఒక్కటై
కదలిరావాలిరా ॥వేయి॥

---

## రెక్కలు

పాత గాయాలు
మానిపోతుంటే
కొన్ని కొత్తగాయాలు
తయారు కావచ్చు -

కాలం
మిత్రుడిలాంటి శత్రువు

ఆడపావురం
గుడ్లను పొదుగుతుంటే
ఆహార అన్వేషణలో
మగపావురం -

అన్యోన్యత
జీవన సాఫల్యం

అనురాగ బంధాలలో
చిక్కుకొని
దిక్కుతోచక
విలవిల లాడుతూ -

ప్రేమ
మహేంద్ర జాలం

ఆకాంక్షలు
పెంచుకొంటూ
అడ్డదారుల్లో
పరుగెడుతూ -

ఎండమావుల్లో
సరిగంగ స్నానాలు

గతాన్ని తొవ్వుకుంటూ కుంగిపోతూ
జరగబోయే దానికి
భయపడుతూ
వర్తమానాన్ని మరచిపోతూ -

కాలం కొలిమిలో
మాడే శలభాలం

ఎవరొచ్చి
కన్నీళ్ళు తుడుస్తారు ?
ఎవరొచ్చి
అక్కున చేర్చుకుంటారు ? -

జీవితం
ఒంటరి పక్షి



తరాలు
తరాలు మధ్య
అంతరాలు
నిరంతరంగా పెరుగుతూ -

కాలానికి
గాలం వేయగలమా ?

బుస కొట్టి
విషం చిమ్మినట్లు
క్రూరంగా బలితీసుకొంటూ
విధి ! -

కాలం
కాలనాగు

గోపాలుని వెంకటేశ్వర్లు
✆ 9247234991

### కావ్యనందనం
(మొదటి సంపుటం)
డా. తిరుమల కృష్ణదేశికాచార్యులు
వెల : రూ.200/- పేజీలు : 153
ప్రతులకు : 27678430




వీరి కవిత్వంలో వస్తు నవ్యత, భావనవ్యతలతో పాటు భాషానవ్యత కూడా కనిపిస్తుంది. అత్యవసరమైన ఆంగ్లపదాలను పద్యంలో ఎందుకు ఉపయోగించకూడదో చెప్పండి అన్నట్టు ఉంటాయి వీరి పదప్రయోగాలు, రోడ్డు, సెకను, రిష్టువాచి, మైకు ఇలాంటి పదాలు ఎన్నో మనభాషలో చేరిపోయాయి. వాడుకలో స్థిరపడిపోయాయి. వీటిని పద్యంలో వాడడం తప్పు ఎలా అవుతుంది? పురాణ కథాకావ్యంలో అయితే ఇది ఎబ్బెట్టు కావచ్చు. ఆధునిక వస్తువైనప్పుడు తప్పేమిటన్నది వీరి ఆలోచన.

బేతవోలు రామబ్రహ్మం

### ఒకమాట (సామాజిక, జీవన దృక్పథం)
సి.సి.రెడ్డి
వెల : రూ.150/- పేజీలు : 216
ప్రతులకు : 9848787284




భయం గురించీ, దేవుడి గురించీ, హింస గురించీ, ప్రేమ గురించీ, పిల్లల గురించీ, కుటుంబం గురించీ, సమాజం గురించీ, దేశం గురించీ, ఇంకా అనేక పరస్పర సంబంధింత విషయాల గురించీ విపులంగానూ, లోతుగానూ పరిశీలిస్తూ చర్చిస్తూ రాసిన వ్యాసాలు ఇవి. స్వీయానుభవాలనూ, ఇతరుల అనుభవాలనూ జోడించి మనస్సుకి హత్తుకునేట్లు రాశారు.

- అబ్బూరి ఛాయాదేవి

### అంటరాని వసంతం
విమర్శనాత్మక పరిశీలన
డా. సామాన్య
వెల : రూ.70/- పేజీలు : 126
ప్రతులకు : 9775600900




తెలుగు సాహిత్యచరిత్రని మలుపు తిప్పింది దళిత ఉద్యమం. ఆ ఉద్యమ నేపథ్యంలో వచ్చిన విశిష్ట నవల 'అంటరాని వసంతం'. శైలీ శిల్పాల రీత్యా విలక్షణమైన ఈ నవలని కూలంకషంగా చర్చించిన రచన ఇది. అయిదు అధ్యాయాల్లో వున్న ఈ గ్రంథం అకాడెమిక్ ప్రమాణాల్ని ఉన్నతీకరించింది. నవలావిమర్శలో ఉదాత్తమైన విలువల్ని పాటించింది. నవలలోని ఇతివృత్తాన్ని, ఆ ఇతివృత్తానికి భూమికగా ఉన్న నేపథ్యాన్ని సవివరంగా చర్చించింది. నవలలోని రచనాశిల్పం మీద ప్రత్యేకదృష్టి నిలిపి సాధికారికంగా విశ్లేషించడం ఈ సిద్ధాంత వ్యాసం ప్రత్యేకత.

### అగ్రతలుపులు (కవిత్వం)
కొండపల్లి నీహారిణి
వెల : రూ.60/- పేజీలు : 136
ప్రతులకు : 9866360082




సమకాలీన సామాజిక స్పృహతో ఇటీవల కాలంలో విరివిగానే కవిత్వం రాస్తున్న కవయిత్రి శ్రీమతి కొండపల్లి నిహారిణి. నిరంతర అధ్యయనంతో పదునెక్కుతున్న నీహారిణి, తెలుగు ఉపాధ్యాయురాలిగా భాషపై పట్టును సాధించింది. పరిశోధకురాలిగా సాహిత్యాన్ని, సమాజాన్ని నిశితంగా అధ్యయనం చేస్తున్నది.

- ఎస్వీ సత్యనారాయణ

### విధ్వంసపు కోరల్లో రామప్ప (కవిత)
నల్లెల సుగుణ
వెల : రూ.30/- పేజీలు : 48
ప్రతులకు : 9989415571




వ్యక్తివాదం ప్రబలి సమష్టివాదం తగ్గిపోతున్న తరుణంలో రామప్పపై కవితా సంకలనం ఒక గొప్ప ఆశ కలిగిస్తున్నది. బృంద శక్తి ఎంతో గొప్పది. ఇవ్వాళ కలాలు కలసి కదులుతున్నాయంటే సమాజం తరపున కరాలు, కంఠాలు నిలిచాయని అర్థం. కీర్తి కండూతితో దిండు పుస్తకాల వల్ల కలగని సంతృప్తి ఒక్క సామాజిక కవిత ద్వారా సాధించవచ్చు. సాధారణీకరించిన ఇతివృత్తం, వ్యక్తిగత అనుభవం తనకు ఒక్కడికే ఆనందం కలుగజేస్తుంది.

- జయధీర్ తిరుమలరావు

### జీవన సందర్భాలు (నానీలు)
రమణ వెలమకన్ని
వెల : రూ.30/- పేజీలు : 51
ప్రతులకు : 9866015040




రమణ కలం నుండి అనర్ఘ రత్నాల్లాంటి నానీలు వెలువడుతుంటే నేనే ఆశ్చర్యపోయాను. జీవితాన్ని దర్శించటంలో ఆయనకు లోతైన అవగాహన ఉంది. ముఖ్యంగా జీవితం పట్ల ప్రేమ ఉంది. జీవితాన్ని ప్రేమించగలిగినవాడే మంచి కవిత్వం రాయగలడని నా నమ్మకం.

- డా. ఎన్. గోపి

## చీలిన మనిషి
ఈతకోట సుబ్బారావు

వెల : రూ.60/- పేజీలు : 104

ప్రతులకు : 9440529785




సమాజానికీ, సాహిత్యానికీ, మానవ అనుభవానికీ వున్న సంబంధమే కళారంగాల చరిత్ర, సుబ్బారావు గారికి తెలుసు ఒక పాత్ర రంగస్థలంపై రంగంపై ఎలా సజీవమౌతుందో గొప్ప నటులు ఎట్లా పుడతారో, ఎట్లా ఎదుగుతారో ఎలా విస్తృతి పొందుతారో తను కవే గాదు, చరిత్రకారుడు కూడా కాబట్టి అది ఆయనకి అనుభవ పూర్వకమయిందే.

- శివారెడ్డి

## ఓడిపోతానని తెలిసికూడా
మానేపల్లి

వెల : రూ.65/- పేజీలు : 148

ప్రతులకు : 8106949467




ఆయుధమే అంతాకాదు
యుద్ధమే అన్నీ కాదు
సమాజ శరీరంలో యుద్ధం
ఒక భాగం
యోధుని శరీరంలో ఆయుధం
ఒక భాగం
విప్లవం ఒక సువిశాల జీవితం
ఆశయం నిశితం

- మానేపల్లి

## ఇష్టవాక్యం
దర్భశయనం శ్రీనివాసాచార్య

వెల : రూ.90/- పేజీలు : 168

ప్రతులకు : 040-27678430




చదివే అలవాటు నా జీవితంలో భాగమైపోయింది. శబ్దాల వెనుక మోగే ధ్వని కోసం, క్లుప్తమైన వ్యక్తీకరణ వెనుక పరుచుకున్న విస్తార జీవితం కోసం విస్తృతంగా చదువుతాన్నేను. ఇంతవరకూ అనుభవంలోకి రాని జీవితాన్ని తెలుసుకోవడానికి, కళారహస్యాల్ని అందుకోవడానికి నిరంతర అధ్యయనం అవసరమని నేను నమ్ముతాను. ఇవవైయేళ్ళ క్రితం చదివిన పుస్తకాన్ని మళ్ళీ ముందేసుకుంటాను, ఇవాళ్టి కళ్ళతో చదవడానికి కొత్త దినుసేమైనా దొరుకుతుందేమోనని.

- డి. శ్రీనివాసాచార్య

## ఓనమాలు
నాగరాజు రామస్వామి

వెల : రూ.50/- పేజీలు : 83

ప్రతులకు : 9963041474




దైనందిన జీవితంలోని అంశాలే కాదు, మానవ అంతరంగ ప్రపంచంలోని భిన్న ప్రకంపనలు వారి కవితా వస్తువులు కావడం విశేషం. సామాజిక పరిణామాల పరంపరని గమనిస్తూ స్పందించే లక్షణం వుంది. సమకాలీన కవిత్వ ప్రపంచంలో వారిది ప్రత్యేకమైన స్వరం. కనుకనే నాగరాజు రామస్వామి గారి ఈ తొలి కవితా సంపుటిని పాఠకుల ముందుకు తీసుకొస్తున్నాం.

- పాలపిట్ట బుక్స్

## షేక్స్‌పియర్ (సాహితీ పరమర్శ)
బుచ్చిబాబు

వెల : రూ.120/- పేజీలు : 219

ప్రతులకు : 27678430




సుళువుగా, సూటిగా ప్రధానభావం అర్థమయ్యేలాగున, వ్యవహార భాషలో, పొడిమాటల్లో, విషయం సుబోధకరం చెయ్యడమే తలపెట్టాను కాని, మక్కికి మక్కి మూలంలో వున్న తికమకల్నీ, వైవిద్యాన్నీ ఎఱుకపరిచే పెద్ద పెద్ద మాటల్లో అనువదించడం ఉద్దేశం కాదు. షేక్స్‌పియర్ గొప్ప కవి. ఆయన జీవిత విశేషాలు తెలిస్తే ఆయన రచనల విశిష్టత మరింత తెలుస్తొంది. ఈ రచన ప్రధాన ఉద్దేశం ఇదే.

- బుచ్చిబాబు

## తడి ఆరని నేల
అరవిల్లి కృష్ణ

వెల : రూ.60- పేజీలు : 119

ప్రతులకు : 27678430




మరల మరల చదవాలనిపించే మంచి కవిత్వం రాస్తారు అరసవిల్లి కృష్ణ. అతను ఎంత సున్నితమో అతని కవిత్వమూ అంతే సున్నితమూ. ఆవేశకావేశాల ప్రదర్శనలా కాక తన భావనా పరంపరని రక్తనాళాల్లో సంలీనం చేసుకొని అభివ్యక్తం చేసే అతని పద్ధతి బాగా నచ్చింది. ఉద్యమ కవిత్వంలో ఒక సాంద్రమైన పార్శ్వాన్ని చాలా కాలం తర్వాత చూశాను.

- గుడిపాటి

## చెప్పి పోదురూ !!!

విజయభాను. కోటి
9291509637



నా చుట్టూ ముళ్ళకంచె
ఈ మాయా మార్కెట్టు
నా తలపై వ్రేలాడే కత్తులు
చుట్టూ మూగిన ఈ సిండికేట్ వ్యాపారులు
తెల్ల బంగారాన్ని వేసినపుడు గంపెడాశ
నా కష్టాలు ఈ ఏడైనా తీరుతాయని
తెల్ల మోహం వేసి మార్కెట్లో నించున్నప్పుడు నా శ్వాసంతా నిట్టూర్పులే....
ధరాఘాతం నా నడ్డి విరిచినపుడు!
పెరిగిపోయిన ఎరువులు, క్రిమిసంహారక మందుల ధరల రెక్కలను
అందుకోవడానికి అష్టకష్టాలు పడే అర్భక రైతును నేను
వర్షాభావాన్ని నా కన్నీటితోనైన కరిగించలేని కర్షకుడిని నేను
ప్రభుత్వ విద్యుత్తు..
పదే పదే పోతుంది
నీళ్ళనిక తోడలేనని....
మోటారు చాలాసార్లు మొండికేస్తుంది
అయినా....
కడగండ్లను గరళంగా మ్రింగేస్తాను
శ్రమను మాత్రమే నమ్ముకుంటాను
ప్రత్తిని పూల ఏరులా పోత పోస్తాను
ఏం లాభం ?
గ్రేడింగు చేయకుండానే మొత్తం సొంతం కావాలి ఒక వ్యాపారికి
ప్రత్తి కార్పొరేషన్‌కు పనిలేదు మరి
గాలికొదిలేసిన నియమాలు.... నా భవిష్యత్తును గాలికెగరేస్తాయి
ధరాఘాతం దెబ్బకు.... నా కుటుంబం నవనాడులూ కృంగిపోతాయి
ఎక్కడిది గిట్టుబాటు ధర ?
అడిగిన కాడికి అయ్యవారికి అమ్ముకుంటే వస్తుందా ?
తెల్ల బంగారాన్ని నాపై కుప్ప పోసి తగలేసుకుంటే వస్తుందా ?
చెప్పిపోదురూ !!!

---

## ఆత్మబంధువు

- ఖిస్.ఆర్ పృథ్వి
9989223245



ఆ వాసన పీలిస్తే చాలు
సంతృప్తి, తనువంతా వ్యాపించి
మనసులో ఆనందం చిగురిస్తాది
మట్టిలో నాటిన విత్తనాలు
మొక్కలై మొలకలెత్తుతాయి
మట్టిని నమ్ముకున్న వాడు
గుప్పెడు తిండి గింజల కోసం
బ్రతుకంతా ఆ వాసనకే అంకితమైపోతాడు
వరదొచ్చి పొలాన్ని ముంచేసినా,
తుఫానులు జీవితాన్ని చిదివేసినా
వెలుగుతున్న నమ్మకం ఒత్తిని ఆరనీయడు
శరీరాన్ని శ్రమలో కరిగించి
జాతికి జీవం పోసేందుకు
మట్టిలో రేణువులై మసులుతాడు
మదిని సమస్యల చీడ పురుగులు పట్టి పీడిస్తున్నా
చూపంతా దిగుబడిపైనే నిలుపుతాడు
తాను చితికిపోతున్న వైనాన్ని
తలకి కట్టిన పాగాలో దాచేస్తాడు
ఉదరకొలిమిలో మంటలు రేగుతున్నా
ఓర్మిని కళ్ళలో నింపుతాడు
గౌరవం భంగపడితే మాత్రం
ఇసుమంత కూడా తట్టుకోలేడు
పంటకి తగిన 'ధర' కిట్టుబాటు కాకుంటే
'ధర'లో బ్రతకడం మానుకుంటాడు
తిండి గింజలు పండించేవాడు
అందరికీ ఆత్మబంధువే.

# ఉత్సాహభరితంగా నంద్యాల సాహిత్య కార్యశాల



సాహితీస్రవంతి కర్నూల్ జిల్లా కమిటీ ఆధ్వర్యంలో నంద్యాలలోని రామక్రిష్ణ పి.జీ. కళాశాలలో రెండు రోజుల కార్యశాల అక్టోబర్ 20-21 తేదీలలో నిర్వహించడం జరిగింది.

ప్రారంభ సమావేశానికి రాష్ట్ర కార్యదర్శి జంధ్యాల రఘుబాబు అధ్యక్షత వహించారు. ఈ కార్యక్రమంలో పి.జీ. కళాశాల అధిపతి రామక్రిష్ణా రెడ్డి, సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి, రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కె. ఆనందాచారి, డా. ఆర్. సీతారాం, సాహితీస్రవంతి జిల్లా కార్యదర్శి కెంగార మోహన్, నంద్యాల డివిజన్ అధ్యక్ష, కార్యదర్శులు ఎం. శ్రీనివాసమూర్తి, మాదాల శ్రీనివాసులు, కవులు రమణమూర్తి, శ్రీనివాస రెడ్డి తదితరులు పాల్గొన్నారు. ఏ సాహిత్యాన్నైనా అర్థం చేసుకోవాలంటే ఆనాటి దేశకాల పరిస్థితులను అర్థం చేసుకోవాలన్నారు. వందేమాతరం అన్న ఒక్క మాట స్వతంత్ర్య పోరాటకాలాన్ని ప్రతిబింబిస్తుందన్నారు.

కన్యాశుల్కం నాటకం ఇప్పటికి 130 ఏళ్ళు పూర్తిచేసుకున్నదని చెబుతూ అందులోని పాత్రలను సృష్టించడమంటే ఆనాడున్న మనుషుల స్వభావాలను చిత్రించడమేనన్నారు. ఈ నాటకంలో నీచ పాత్రలకు నీచ భాష, ఉచ్ఛ పాత్రలకు ఉచ్ఛ భాషను పెట్టడాన్ని ఆయన వ్యతిరేకించారన్నారు. దానివల్ల ఒక ప్రామాణికమైన 'అందరిభాష' ఏర్పడిందన్నారు. దానివల్ల వివిధ శక్తుల మధ్య సమన్వయం కుదిరిందన్నారు. దేశభక్తి గేయంలో తిండి కలిగితే కండకలదోయ్ అని అంటే, నేడు ఆహారభద్రత గురించి చెప్పుకోవలసిన దుస్థితి ఉండటం, అందులో బాల్య వివాహాలను గురించి చెబితే నేడు స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యలకు బాల్యవివాహాలే పరిష్కారమనే స్థాయికి నేడు నాయకులు దిగజారటం చూడొచ్చన్నారు.

గురజాడ స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనలేదనే వారు ఆయన చనిపోయే నాటికి అది ఏ రూపంలో ఉండేదో చూడాలన్నారు. అప్పటికి బ్రిటీష్ వారికి మహజర్లు సమర్పించే స్థితిలోనే నాటి పోరాటముందన్నారు. 1920 తర్వాత గానీ గాంధీ ఆఫ్రికా నుండి రాలేదని, అప్పటికి గురజాడ లేరన్న విషయం గమనంలో ఉంచుకోవాలన్నారు. స్వతంత్రం వస్తే కానిస్టేబుల్ నుండి తనకు కష్టాలు తొలగిపోతాయా అని ఒక పాత్ర ద్వారా అనిపించడం బ్రిటీష్ వారిని ఎదిరించడమే నన్నారు. తాను ఏమేమి రాయాలో పట్టిక తయారు చేసుకోవటాన్ని ఈ సందర్భంగా గుర్తుచేసారు. ఆయన అభ్యుదయ వాదే కాక అంకితభావం గల వ్యక్తిగా కొనియాడారు.

అదే రోజు మధ్యాహ్నం కె. ఆనందాచారి 'కవిత్వం-వస్తురూపాలు' అన్న అంశాన్ని వివరించారు. రాయడంలో అనేక విషయాలు తెలుసుకోవాలని, అధ్యయనం ముఖ్యమని అన్నారు. రాయాలన్న కోరికకు కారణం పక్కవాడితో తన భావనలను పంచుకోవటమని గోర్కీ చెప్పారని, దీనికి అంతరంగిక ప్రేరణ ముఖ్యమన్నారు. జీవన పోరాటం నుంచే భాష పుట్టిందని, ప్రకృతికి మనిషి అనుభూతుల్ని జోడించటమే కవిత్వమన్నారు. వస్తువు శిల్పం రెండూ ముఖ్యమేనని, మట్టి ఉన్నంతనే కుండ తయారు కాదని, అలాగే సరియైన శిల్పం లేకుండా వస్తువుకు రూపం సరిగా ఉండదన్నారు. వాస్తవిక జగత్తు నుండే వస్తువు పుడుతుందన్నారు. జీవితాన్నుండి పోగేసుకున్న వాక్యమే కవిత్వమన్నారు.

అనంతరం డా. సీతారాం కవిత్వావరణం పేరుతో తరగతిని నిర్వహించారు. హాజరైన సభ్యులను జట్లుగా చేసి వారిచే అభ్యాసాలను చేయించారు. కవిత్వమంటే ఏమిటి అన్న ప్రశ్న సంధించి వివిధ జట్ల నుండి పసందైన సమాధానాలను రాబట్టారు. ఒక కవితలోని భాగాలను జట్లకు ఇచ్చి వాటిని తిరగ రాయించారు. చివరిలో 'రబ్బరు' వస్తువుగా తీసుకుని కవితలను రాయించారు. హాజరైన ప్రతి సభ్యుడు చురుగ్గా పాల్గొని కార్యశాలలో ఉత్సాహ వాతావరణాన్ని తెచ్చారు.

రెండోరోజు ఉదయం 'పాట-పరిణామం' అంశంపై డా. కళామురళి మాట్లాడారు. 'లయబద్ధమై, మంచి భావం కలిగి ఉండి, ఆలాపనకు పనికి వచ్చేదే పాట' అని చెబుతూ తన తరగతిని ప్రారంభించారు. పాటలి పదము, నురుగు అని పర్యాయ పదాలున్నాయన్నారు. జీవితంలోని ప్రతి ఘట్టానికీ ఒక పాట ఉంటుందన్నారు. పాటకు 'క్లుప్తత, ఆర్ద్రత, ఆశ్రుత' ముఖ్యమైనవన్నారు. సాకీ, పల్లవి, అనుపల్లవి, చరణం గురించి వివరించారు. పల్లవి 44 రకాలుగా ఉంటుందన్నారు. పాటకు ఎత్తుగడ ముఖ్యమన్నారు. పాటకూ, పద్యానికీ తేడా వివరించి గానానికి అనుకూలమైనది పాట అన్నారు. జానపదాలు, పెళ్ళి పాటలు, ఎంకి పాటలు తదితర

## నానీలు

ఎన్.సిహెచ్. చక్రవర్తి

✆ : 9399958069



శిశిరాన
చెట్లు వలవలా
శ్రావణాన
గట్లు గలగలా

రక్తదానం చేసినవాణ్ణి
రోగిని చెయ్యడం
దోమకో
పెద్ద రోగం

వంకరలు తిరిగినా
అక్షరాలు
బుద్ధిని
సాపు చేసాయి

ఉగ్రవాదం కక్కిన
రక్తం ఆరింది
రాజకీయపు
చారిక చూడు

చట్ట సభలన్నీ
రద్దైతే
నాటక రంగానికి
పెద్ద ముప్పే !

విషాదాన్ని నువ్వు
వలచావు
లేకపోతే
అక్షరం నన్నెందుకు వరిస్తుందీ ?

పార్టీలలో
రావణులు కోకొల్లలు
రామునికై
వెతకండి

అప్పరసలు
నా కవనంలో
అప్షరసాలు
నా – కవనంలో

---

పాటల్లోని రకాలను పరిచయం చేసారు.

అనంతరం బాలసాహిత్యంపై రఘుబాబు, కెంగార మోహన్ లు మాట్లాడారు. సాహిత్యంలో బాలసాహిత్యం భాగమనీ, అది బాలలకు ఉపయోగపడేలా ఉండాలనీ, వారిలో ఆలోచనా శక్తిని పెంపొందించాలని రఘుబాబు చెప్పారు. బాలల కథలు, వాటి ఇతివృత్తాలు, పాత్రలు బాలసాహిత్య ప్రాముఖ్యాన్ని తెలుపుతాయన్నారు. పంచతంత్ర కథల్లో జంతువులే పాత్రలుగా చేసి చెప్పినందువల్ల అవి బాలల హృదయాలకు నేరుగా హత్తుకుంటాయని అన్నారు. బాలలకు చదివే అలవాటును నేర్పించటం అవసరమన్నారు. బాలసాహిత్యం ద్వారా మాతృభాష పరిరక్షణ జరుగుతుందన్నారు. బాలలకు ఇష్టమైన అంశాలేమో తెలుసుకుని రాయటం మంచిదన్నారు.

అనంతరం కెంగార మోహన్ మాట్లాడుతూ పౌరాణిక, జానపద అంశాల్ని బోధించటం ద్వారా పిల్లల్లో నీతిని గురించిన అవగాహన పెంచవచ్చన్నారు. బాలలకోసం చేసే రచనలలో భాష సరళంగా ఉండాలన్నారు. కథల్లో నీతి అనేది అంతర్లీనంగా ఉండాలి అన్నారు. కథ చివర్లో నీతి గురించిన వాక్యం జోడించడం వల్ల కథలో చెప్పిన అంశం సుబోధకంగా ఉంటుందన్నారు. పిల్లల కథల్లో కొన్ని ప్రయోగాలు చేయాలన్నారు. వారితోనే కథలు రాయించడం వంటివి చేయాలన్నారు.

మధ్యాహ్నం సాహిత్య విమర్శపై డా. పి.ఎల్. శ్రీనివాస్ రెడ్డి ప్రసంగించారు. విమర్శకుడు ఆటల్లోని అంపైర్‌లా ఉండాలన్నారు. నిర్భయంగా విమర్శించగలగటంలో ఓ సైన్యాధ్యక్షుడిలా కఠినంగా ఉండాలన్నారు. కవి అన్నవాడు రక్తమాంసాకృతి కాదు 'అక్షరాకృతి' అన్నారు. సముద్రం ఎంత లోతుగా ఉంటుందో సాహిత్యం అంత లోతైనదన్నారు. విమర్శకుడి తల పట్టుదల, కవి పదం అంతంలో 'వి' అంటే విమర్శకుడు అన్నారు. కవి సాధారణ అర్థంలో రాసిన దాన్ని సాధారణంగానే తీసుకోవాలి తప్ప విమర్శకుడు రాద్ధాంతం చేయకూడదన్నారు. దేహం ఉన్నవాడు సందేహపడాలి అంటూ చమత్కార ధోరణిలో ప్రసంగించి అందర్నీ ఆకట్టుకున్నారు.

అనంతరం డా. సహదేవుడు, సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి వొరప్రసాద్‌లు ఆత్మీయ సందేశాల్ని ఇచ్చారు. కార్యశాలలో పాల్గొన్న ప్రతి ఒక్కరికీ తెలకపల్లి రవి 'అర్హతాపత్రాల్ని' అందజేశారు. ఈ సందర్భంగా జరిగిన ముగింపు సమావేశంలో ఆయన మాట్లాడుతూ నంద్యాల ప్రాంతంలో సాహితీప్రియుల్లో సాహిత్య కార్యశాల మంచి ఉత్సాహం నింపిందన్నారు.

సాహితీస్రవంతి సభ్యులు మహేశ్వరయ్య, అయ్యన్న, బసప్ప, షఫీ, భాస్కర్, నరసింహులు, ఆల్ఫోన్సా, శంకరయ్య, ప్రేమ్‌కుమార్, మనోహర్, శ్రీమొవాస రెడ్డి, రమణమూర్తి ఔత్సాహిక కవులు, సాహిత్యాభిమానులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. చివరిలో జరిగిన జనకవనంలో పలువురు తమ కవితలను చదివి వినిపించారు. నంద్యాల డివిజన్ అధ్యక్ష కార్యదర్శులు ఎం. శ్రీనివాస మూర్తి, మాదాల శ్రీనివాసులు తీసుకున్న చొరవ వల్లనే ఈ కార్యక్రమం విజయవంతమైందని రామకృష్ణారెడ్డి తన ప్రసంగంలో పేర్కొన్నారు. మాదాల శ్రీనివాసులు వందన సమర్పణతో కార్యక్రమం ముగిసింది.

**– సాహితీస్రవంతి కర్నూలు జిల్లా కమిటీ**

# ప్రపంచీకరణకు ధీటుగా సాహిత్యంలో పదును

ప్రపంచీకరణ యుగానికి తగినంత శక్తివంతంగా కవిత్వాన్ని పదునెక్కించాల్సిన ఆవశ్యకత నేటి పరిస్థితుల్లో ఉందని వక్తలు అన్నారు. సాహితీస్రవంతి నగర కమిటీ ఆధ్వర్యంలో ప్రపంచ కవిత్వ దినోత్సవం సందర్భంగా సుందరయ్య విజ్ఞాన కేంద్రం (షోయబుల్లాఖాన్ హాల్)లో అక్టోబర్ 15న నగర కార్యదర్శి జి.యాదగిరిరావు అధ్యక్షతన జరిగిన కవిత్వం - వర్తమానం అనే సదస్సులో వారు మాట్లాడారు. శ్రీవెంకటేశ్వర విశ్వ విద్యాలయం పూర్వ ఉపాధ్యక్షులు డా.కొలకలూరి ఇనాక్ మాట్లాడుతూ సమాజం వైరుధ్యాల పుట్టగా ఉందని, ఈ పరిస్థితిలో సమస్యకు మూలాన్ని వెతుక్కోవాలని, సమస్యను అర్థం చేసుకోకుండా, ప్రేమైక జీవులు కాకుండా బలమైన కవిత్వం రాయడం కష్టమని చెప్పారు. దేశ స్ఫురణతో రచించిన గురజాడ, ఠాగూర్ వారి కవిత్వాలు సమాజంలో సజీవంగా ఉన్నాయన్నారు. రెండు రూపాయలకు కిలో బియ్యం ఇచ్చి రెండు వందల రూపాయల పన్నులు గుంజుతున్న నేటి పరిస్థితుల్లో గుడుగుడు గుంచంలా... తన గూట్లోనే కుచించుకు కూర్చున్న ప్రజలను తట్టిలేపే కవిత్వం కావాలని చెప్పారు. సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి మాట్లాడుతూ ప్రపంచీకరణకు వ్యతిరేకంగా పదునెక్కిన కవిత్వాన్ని తీసుకురావడం ఎంతో అవసరమని చెప్పారు. ప్రస్తుతం దోపిడి పదునెక్కుతోంది గానీ దాన్ని వ్యతిరేకించే కవిత్వం పదునెక్కక పోవడం ఆవేదనగా ఉందని చెప్పారు. ప్రపంచీకరణ యుగంలో ఒక్కొక్క దేశం ఒక్కో సంతగా మారిన నేటి పరిస్థితిలో ఇక్కడి నేలలో మొలవాల్సిన విత్తనాలను ఎక్కడినుంచో దిగుమతి చేసుకోవాల్సి రావడం విడ్డూరమన్నారు. కవిత్వానికి జీవ శక్తి రావడం ఎంతో అవసరమని వక్కాణించారు. మన్మోహన్ సింగ్ మాత్రం సంస్కరణల వేగాన్ని పెంచడం చూస్తే కవుల బాధ్యత మరింత పెరిగిందని, ఆ కవిత్వం సమగ్రమైన జీవన అవగాహనను పెంచేదిగా ఉండాలని చెప్పారు. ఆంధ్ర సారస్వత పరిషత్ ప్రాచ్య కళాశాల మాజీ ప్రిన్స్‌పాల్ మోతుకూరి నరహరి మాట్లాడుతూ కవిత్వం ఒక సృజనాత్మక ప్రక్రియ. నిరంతర అన్వేషణ ద్వారానే సజీవమైన కవిత్వం, ప్రజాప్రయోజనమైన కవిత్వం కవి గుండెలోతుల్లోనుంచి ఉట్టిపడుతోందని చెప్పారు.

సాహితీ స్రవంతి నగర సంయుక్త కార్యదర్శి తంగిరాల చక్రవర్తి అధ్యక్షతన జరిగిన జనకవనం సభికులని ఆకట్టుకుంది. నాగశిరీష పాడిన సలలలిత సంగీతమా.. సుమధుర గానమా.. అన్న గేయంతో ప్రారంభమయిన జనకవనంలో ముందుగా రఘువీర ప్రతాప్ ఆ తలంపు అన్న కవితలో అమ్మకమ్మదనాన్ని కవిత్వీకరించారు. తెలుగుతల్లి ఆవేదన కె.ఎల్ కామేశ్వరరావు మదిలో నుంచి జాలువారిన కవిత్వం రైతన్న దీనావస్థను కళ్లకు గట్టింది. "మారైతు బిడ్డ దేశానికి వెన్నుముకట! చిత్రం వాడి చేతిలో వరివెన్నులేదు, పాలకంకి లేదు, పురుగుల మందు డబ్బాతప్ప! ఇది భారత పాలకుల గుండెలపై గుద్దిన కవిత్వం అంటే అతిశయోక్తి కాదేమో! కవిత్వమంటే శీర్షికతో పొత్తూరు సుబ్బారావు, కవిత్వం వర్తమానం అనే శీర్షికతో మాధవి కవిత్వానికి ఉండాలి సామాజిక బాధ్యత అని మరో సారి సామాజిక బాధ్యత ఆవశ్యకతను ఎత్తిచూపింది. నిష్టూర నిజం శీర్షికతో దుర్గాప్రసన్న ఆడపిల్లలు తగ్గిపోవడంపై తమ ఆవేదనను కవిత్వం ద్వారా చెప్పారు. రత్నామహేందర్, శాంతిశ్రీ, జి.యాదగిరిరావు, వెంకట్, వెంకటేశ్ బి. వెంకట్, కె.రాజ్యలక్ష్మి వూసల రజనీగంగాధర్, రత్నామహీధర్, జి.నరేష్, టి.కిషోర్, వి.వి.ఆర్ శాస్త్రి, తదితర కవులు కవితలను వినిపించారు. సాహితీ స్రవంతి రాష్ట్రకార్యదర్శి వీరప్రసాద్ వందన సమర్పణతో సభ ముగిసింది. ♦



**ప్రపంచ కవితాదినోత్సవం సందర్భంగా అక్టోబర్ 15న సుందరయ్య విజ్ఞానకేంద్రంలో సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో జరిగిన కార్యక్రమంలో ప్రసంగిస్తున్న డా. కొలకలూరి ఇనాక్, చిత్రంలో సింహాద్రి నాగశిరీష, శాంతిశ్రీ, తంగిరాల చక్రవర్తి, జి. యాదగిరి రావు, మోతుకూరి నరహరి, వెంకటి**



**తెలుగు సాహిత్య కళాపీఠం ఆధ్వర్యంలో శ్రీత్యాగరాయ గానసభలో అక్టోబర్ 4న కేతవరపు రాజ్యశ్రీ రచించిన 'అక్షరకేతనం' పుస్తకాన్ని డా.సి.నా.రె ఆవిష్కరించారు. చిత్రంలో డా. గజల్ శ్రీనివాస్, డా. తిరునగరి, గుదిబండి వెంకటరెడ్డి, డా. పి.యస్ మూర్తి తదితరులు ఉన్నారు.**

## ఝాన్సీ కె.వి.కుమారి పుస్తకాల ఆవిష్కరణ



కవయిత్రి శ్రీమతి ఝాన్సీ కె.వి.కుమారి రచించిన 'అంతరంగం' 'గ్రంధం', క్రీస్తుక్రాంతి స్వరాలు' ఆడియో ఆల్బుమ్‌లను హైదరాబాద్‌లోని రవీంద్రభారతి కాన్ఫరెన్స్ హాలులో 2న ఆవిష్కరిస్తున్న డా.సి.నారాయణరెడ్డి. చిత్రంలో ఎడమ నుండి డా. సిహెచ్ భవానీ దేవి, ఆకాశవాణి వివిధ భారతి పూర్వ సంచాలకులు నల్లూరి బాబురావు, పాత్రికేయులు ప్రభుకిరణ్ సభాధ్యక్షులు డా.యన్.గోపి, రచయిత్రి, శ్రీమతి డా. ఎ.బి.కే ప్రసాద్, 'అంతరంగం' స్వీకర్త కె.రామచంద్రమూర్తి, ఆచార్యకొలకలూరి ఇనాక్ ఉన్నారు.

రచయిత్రి, ఆకాశవాణి కార్యక్రమ నిర్వహణాధికారి శ్రీమతి ఝాన్సీ కె.వి. కుమారి రచించిన 'అంతరంగం' వ్యాస సంపుటి. 'క్రీస్తుక్రాంతి స్వరాలు' పాటల ఆడియో ఆల్బమ్ లను జ్ఞానపీఠ అవార్డు గ్రహీత పద్మభూషణ్ డా.సి. నారాయణ రెడ్డి హైదరాబాదులోని రవీంద్రభారతి కాన్ఫరెన్స్ హాలులో అక్టోబర్ 2న ఆవిష్కరించారు.

సభకు అధ్యక్షత వహించిన డా.ఎన్.గోపి మాట్లాడుతూ రచయిత్రి ఇంతవరకూ నిశ్శబ్దరాగం, రుధిర ప్రస్థానం, 'వినిపించని రాగాలు' నాటకాలు – 'నాతిచరామి', యాత్రా కథనం' కాల నిర్ణేత అడుగుజాడలను స్పృశిస్తూ 'నానీలు' అక్షరబిందువులు మొదలగు వానిని విడుదల చేశారన్నారు.

'వార్త' పత్రికలో 2000 సంవత్సరం కొత్త మిలీనియంతో ప్రారంభించి నాలుగు సంవత్సరాల పాటు 'కాలమ్'ను ధారావాహికంగా రాయడం అభినందనీయమంటూ, ఆ గ్రంధాన్ని ఆ 'కాలమ్'ను రాయించిన నాటి సంపాదకులు రామచంద్రమూర్తి గారికి అంకితమివ్వడం సముచితంగా ఉందన్నారు. హెచెమ్ టీవీ సిఇఓ గ్రంథం స్వీకర్త కే. రామచంద్రమూర్తి రచయిత్రి రచనా పటిమను, మానవతా విలువల పట్ల ఆమెకున్న నిబద్ధతను కొనియాడారు.

విశిష్ట అతిథులుగా వచ్చేసిన ఆచార్య కొలకలూరి ఇనాక్ మాట్లాడుతూ రచయిత్రి ఝాన్సీకి, భారతదేశమన్నా, భారతీయులన్నా, భారతమాత అన్నా ఎల్లలు లేని ప్రేమ అని ఆమె రచనల్లో ప్రేమ ప్రవహిస్తూ ఉంటుందని, మన దేశం గానీ, ప్రపంచం గానీ ఎదుర్కొనే సమస్యలన్నింటికి ఒకే ఒక్క పరిష్కారం మనుషుల మధ్య ప్రేమ పరిమళించడమని ఆమె రచనలు చాటిచెప్తాయన్నారు.

మరో విశిష్ట అతిథిగా విచ్చేసిన ప్రముఖ పాత్రికేయులు డా. ఎ.బి.కె ప్రసాద్ మాట్లాడుతూ ఈ 'అంతరంగం' మొదటి పేజి నుండి చివరి పేజి వరకు గాంధేయ సాత్విక వాదం, కార్ల్ మార్క్స్ స్వేచ్ఛా సమానవతా వాదం, జీసస్ చూపిన ప్రేమ, మానవతావాదాలు త్రివేణి సంగమల్లా పెనవేసుకుని ప్రవహిస్తున్నాయన్నారు.

'అంతరంగ' సంవీక్షణంగావిస్తూ ప్రముఖ రచయిత్రి డా.సి.హెచ్. భవాని దేవి భాష మీద మంచి పట్టు ఉన్న శ్రీమతి ఝాన్సీ గారు విభిన్నమైన అంశాలతో కాలమ్ ప్రచురించబడుతున్న రోజుల్లోనే ఒక సంచలనాన్ని సృష్టించారన్నారు. 'నేను' అనే స్వార్థాన్ని విడనాడి, 'మనం' అనే సమైక్యతా భావాన్ని గుండెల్లో నింపుకొమ్మనే పిలుపు ఈ అంతరంగ మిస్తోందన్నారు. పాత్రికేయులు ప్రభుకిరణ్ క్రీస్తు క్రాంతి స్వరాలు' హృదయావిష్కరణం చేస్తూ క్రీస్తు ప్రభువు ప్రకటించిన ప్రేమ విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని కాంక్షిస్తుందని, అది ఏ మతానికో, వర్గానికో పరిమితమైనది కాదని, ఆ సందేశాన్నే శ్రీమతి ఝాన్సీ కలం ఈ గేయాల ద్వారా ప్రకటిస్తుదని అన్నారు.

సభా ప్రారంభకులుగా వ్యవహరించిన ఆకాశవాణి వివిధ భారతి పూర్వ సంచాలకులు నల్లూరి బాబూరావు గారు వందన సమర్పణ చేయగా గ్రంథావిష్కరణ సభ ముగిసింది.

---

## కవితల పోటీకి ఆహ్వానం

నెల్లూరు జిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో కవితల పోటీ నిర్వహిస్తున్నట్లు ఆ సంఘం అధ్యక్షులు ఎ.జయప్రకాష్ ఒక ప్రకటనలో తెలిపారు. ఈ పోటీలో గెలుపొందిన వారికి ప్రథమ బహుమతి రూ. 5116/- ద్వితీయ బహుమతి 3116/- తృతీయ బహుమతి రూ. 2116/- అందివ్వనున్నట్లు తెలిపారు. డిశెంబరు 10వ తేదీ లోపు తమ కవితలను 'మాటేటి రత్నప్రసాద్, నెరసం కోశాధికారి, టెలిఫోన్ ఎక్స్ఛేంజ్ ఎదురుగా, మెయిన్‌రోడ్, బుచ్చిరెడ్డి పాళెం, శ్రీపొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లా – 524305 చిరునామాకు పంపవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు 9010771622 ద్వారా సంప్రదించవచ్చును

## కథల పోటీకి ఆహ్వానం

సోమేపల్లి హనుమంతరావు స్మృత్యర్థం ఈ సంవత్సరం కూడా సాహితీ పురస్కారాలను అందజేయనున్నట్లు పురస్కారాల కమిటీ ఛైర్మన్ సోమేపల్లి వెంకటసుబ్బయ్య, చలపాక ప్రకాష్‌లు ఒక ప్రకటనలో తెలిపారు. రమ్యభారతి ఆధ్వర్యంలో జాతీయస్థాయి తెలుగు చిన్న కథల పోటీని నిర్వహిస్తున్నట్లు తెలిపారు. ఈ పోటీలకు నవంబరు 15 లోపుగా కథలను 'రమ్య భారతి, పి.బి.నెం. 5, 11-57/1-32, జె.ఆర్. కాంప్లెక్స్, 2వ అంతస్తు, రజక వీధి, విజయవాడ – 520001 చిరునామాకు పంపించవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు 9247475975 ద్వారా సంప్రదించవచ్చును.



ఇందూరు భారతి రచయితల సమాఖ్య నిజామాబాద్ ఆధ్వర్యంలో అక్టోబర్ 2న స్థానిక గీతాభవన్‌లో కవి సమ్మేళనంలో మాట్లాడుతున్న ముఖ్య అతిథి డా. కేశవరెడ్డి చిత్రంలో మేక వామస్వామి ఎ. సూర్య ప్రకాష్, వి.పి. చందనరావు.



అక్టోబర్ 7న "పూలరేకులపై ప్రేమలేఖలు" కవితాపుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న చందన్‌రావు, దాస్యం, గంగిశెట్టి, సి.వి.ఆర్., తణికెళ్ళభరణి, దేవి, రచయిత యక్కలూరి శ్రీరాములు



జి.వి.ఆర్ ఆరాధన కల్చరల్ ఫౌండేషన్ ఆధ్వర్యంలో అక్టోబర్ 1న హైదరాబాద్ త్యాగరాయగాన సభ కళా సుబ్బారావు కళావేదికలో పొత్తూరి జయలక్ష్మి రచించిన 'నిశ్శబ్ధ జలపాతాలు' కథల సంపుటిని ఆవిష్కరిస్తున్న రాష్ట్ర సాంస్కృతిక సలహాదారు డా.కె.వి. రమణాచారి. చిత్రంలో కృతి స్వీకర్త పింగళి కమలా కేసరి, డా. రావూరి భరద్వాజ, సుధామ, డా. పాలకుర్తి మధుసూదనరావు, సంస్థ అధ్యక్షులు గుదిబండ వెంకటరెడ్డి, కేతవరపు రాజ్యశ్రీ, సమీక్షకులు గురజాడ శోభాపేరిందేవి, పెద్దూరి వెంకటదాసు.



తూ.గో. జిల్లా కొత్తపేట ప్రియదర్శిని బాల విహార్ హైస్కూల్లో ఉపాధ్యాయులు, విద్యార్థుల అనుబంధంపై డా. అద్దేపల్లి రామమోహనరావు ప్రసంగించిన సందర్భంగా ఎ.బి.టి. సుందరీదేవి సంకలనం చేసిన మహానుభావుల మహితోక్తులు పుస్తకాన్ని ఆవిష్కరించిన డా. అద్దేపల్లి. ఫొటోలో ఎడమ నుండి ప్రియదర్శిని హెడ్మాష్టర్ ఎ.బి.సి. దేవ్, స్థానిక కళాసాహితి అధ్యక్షులు పి. హరిహర దేవళరాజు, వి.కె.వి. డిగ్రీ కాలేజీ ప్రిన్సిపాల్ డా. ఆర్.ఎస్. వెంకటేశ్వరరావు, నల్లం చక్రపాణి రావు.

సాహితీస్రవంతి భద్రాచలం డివిజన్‌శాఖ మరియు ప్రజానాట్యమండలి డివిజన్ శాఖ సంయుక్త ఆధ్వర్యంలో స్థానిక గౌతమి మోడల్ స్కూల్లో నిర్వహించిన మహాకవి గురజాడ 150వ జయంతి సాహిత్య సభలో ప్రసంగిస్తున్న ప్రధానవక్త జి.గోపాలకృష్ణ, వేదికపై (ఎడమ నుండి కుడి వైపుకి) ఐ.వి., (ప్రజానాట్య మండలి డివిజన్ కార్యదర్శి) తాతోలు దుర్గాచారి (సాహితీ స్రవంతి డివిజన్ కార్యదర్శి) ఎన్.సి.హెచ్ చక్రవర్తి, (సభాధ్యక్షులు) కె. పార్థసారధి (విశ్రాంత ప్రధానోపాధ్యాయులు) ఎ. జగన్నాధరావు (గౌతమ్ మోడల్ స్కూల్ ప్రధానాచార్యులు) వీధుల రాంబాబు (ఉపాధ్యక్షులు సాహితీ స్రవంతి భద్రాచలం)



## బి.వి.వి. ప్రసాద్ 'ఆకాశం'కు 'ఇస్మాయిల్ కవితా పురస్కారం'



పశ్చిమగోదావరి జిల్లా, తణుకు పట్టణానికి చెందిన బివివి ప్రసాద్ రచించిన 'ఆకాశం' కవితా సంపుటి 'ఇస్మాయిల్ మిత్రమండలి' ఇచ్చే 'ఇస్మాయిల్ కవితా పురస్కారం 2011' పురస్కారానికి ఎంపికయ్యిందని ఆ సంస్థ ప్రతినిధి వాడ్రేవు వీరలక్ష్మిదేవి ఒక ప్రకటనలో తెలిపారు.

బివివి ప్రసాద్‌కు ఈ పురస్కారం పేరిట పదివేల రూపాయల నగదు, అభినందన పత్రం, జ్ఞాపికను నవంబరు 4న కాకినాడలో జరిగే ఇస్మాయిల్ స్మారక సభలో అందజేయనున్నట్లు తెలిపారు. వర్తమాన తెలుగు సాహిత్యంలో హైకూ కవిగా బివివి ప్రసాద్ ప్రాచుర్యం పొందారు. రెండు దశాబ్దాలుగా కవిత్వం రాస్తున్న ఆయన ఇప్పటివరకూ మూడు హైకూ సంపుటాలూ, మూడు వచన కవితా సంపుటాలూ ప్రకటించారు.

## విడదల సాంబశివరావుకు 'డా. పట్టాబి కళాపీఠం పురస్కారం'



డాక్టర్ పట్టాభి కళాపీఠం ఆధ్వర్యంలో 'మూసల వజ్రమ్మ శ్రీరాములు స్మారక ప్రతిభా పురస్కారం' పేరున నాటక రచనకు గాను విడదల సాంబశివరావు రచించిన 'ఓ నాన్న కథ' నాటక సంపుటికి ప్రకటించినట్లు కళాపీఠం వ్యవస్థాపక అధ్యక్షులు తూములూరి రాజేంద్రప్రసాద్ ఒక ప్రకటనలో తెలిపారు. మచిలీపట్నంలో నవంబర్ 20న జరిగే వార్షికోత్సవ సభలో ఈ పురస్కారాన్ని అందివ్వనున్నట్లు ఆ ప్రకటనలో తెలిపారు. సాహిత్య, సాంస్కృతిక రంగాలకు చెంది, వివిధ ప్రక్రియలలో ప్రతిభావంతులకు కళాపీఠం ప్రతీయేటా పురస్కారాలు అందజేస్తున్నట్లు తెలిపారు.

## స్పందన

## చీకటి వెలుగుల ఉనికి 'మట్టిరంగు'

**డా.కె.జి. వేణు**

చదవగానే మెదడులోని కణాలకు కదలిక వచ్చిందంటే.. తప్పకుండా ఆ కవిత గొప్ప కవిత అవుతుంది సెప్టెంబర్ సాహిత్య ప్రస్థానంలోని డా. ఎన్. గోపి కవిత "మట్టిరంగు" అటువంటి అనుభూతినే పాఠకులకు అందిస్తుంది.

కవిత ఎత్తుగడే అద్భుతంగా ఉంది.

"మట్టికి నిద్రరాదు"

ఆలోచిస్తే.. ఈ సృష్టి మొదలునుంచి.. నేటిదాకా.. మళ్లీ రేపటి దాకా... మళ్లీ.. మళ్లీ ఈ సృష్టి అంతం దాకా.. ఈ మట్టికి నిద్ర రాదు.. నిద్రపోయే అవకాశమే లేదు.. ఎందుకంటే మట్టి నిద్ర పోవటమంటే.. మానవజాతి మొత్తం శాశ్వతంగా నిద్రపోవటమే.. .. అందుకే కవి ఇలా అంటారు..

"అనవరత నిర్నిద్రాచలిత ముద్రిత మట్టి"

భూమి వెలుపల కోట్లాది జీవరాశులు ఉన్నట్లే.. భూమి పొరల్లో, మట్టి కణాల తల్లి ఒడిలో కోట్లాది జీవకణాలు జీవం పోసుకుంటూ ఉంటాయి.. నిత్యం నిత్య గర్భిణి 'మట్టి'.. కడుపులో బిడ్డ తిరుగాడుతూ ఉంటే తల్లి పొందే అనుభూతిని.. మట్టి కణాలలో సైతం దర్శింపచేస్తారు కవి..

"ఒంటినిండా జీవకణాలు కదుల్తుంటే
కళ్లుమూసుకొని
కొత్త సృష్టిని అనుభూతి చెందుతుంది"

ఈ పంక్తుల నిండా.. నెలల బిడ్డను మోస్తున్న తల్లి రూపమే మనకు కనిపిస్తుంది.. నిద్రపోతే తప్ప.. మనిషికి కలల ప్రాప్తి జరుగదు.. మట్టి అందుకు అతీతంగా కనిపిస్తుంది.

"నిద్రరాకున్న
భూమి కలలు కంటుందనడానికి
ఈ పువ్వులే సాక్ష్యం"

ఈ ప్రకృతి సంపదంతా మట్టి.. కలల రంగుల పంటే కదా.. ఆ పంటే మానవజాతి మొత్తానికి... సిరులు, సౌభాగ్యం, సంపద అందిస్తోంది.. భూమి కలలు కనటం మానేస్తే.. ఈ నేల నిండా ఎడారులు మాత్రమే మిగుల్తాయి..

ఆకాశం భూమికి మధ్యనున్న అనుబంధాన్ని కొలవటానికి ఏ కావ్యాలు చాలవు.. ఏ భాషా సాహిత్యమూ సరిపోదు.. కానీ ఈ సందర్భంలో కవి భావన ఆ అనుభూతుల్ని సంపూర్ణంగా మనకు అందిస్తుంది.. ఎలాగంటే ఇలా..

"ఆకాశం ఆశగా నవ్వితే
దానికి ఇంద్రధనుస్సు కండువా కప్పుతుంది
ఏ రంగు ఇష్టమని అడిగితే
తెల్లబోయి చూస్తుంది"

ఇక్కడ ఆకాశం నవ్వటం అంటే... తన వెలుగు కిరణాల ప్రవాహాన్ని.. భూమికి కానుకగా అందించటం.. అందుకు కృతజ్ఞతగా చిరుజల్లుల అద్భుత వేదిక మీద ఏడు రంగుల కండువాను, భూమి ఆకాశానికి సగౌరవంగా సమర్పించుకుంటోంది.. ఈ భావాల వెనుక

కవి ఆశిస్తున్న ప్రయోజనం ఏమిటంటే.. భూమి, ఆకాశాల మధ్యనున్న అనుబంధమే మనుష్యుల మధ్య కూడా కొనసాగాలని.. నేల, నింగి మొత్తం రంగుల కండువాలతో నిండిపోవాలని.. ఈ ఉదాత్తమైన కవి భావన.. పాఠకుల గుండెల్లో మళ్లీ.. మళ్లీ గుర్తుకొస్తుంది... గుర్తుకొచ్చిన ప్రతిసారి ఆలోచింపచేస్తుంది.. ఇది ఈ కవిత సాధించిన గొప్ప ప్రయోజనం.

ఈ కవితనిండా ఉన్నతోత్తమైన భావ సంపదను కవి రాశులు, రాశులుగా మనకు అందించారు... మట్టికి, పేదరికానికి ఉన్న బింబ, ప్రతిబింబ భావ సామీప్యాలను కవి ఆవిష్కరించిన తీరు.. మంత్రముగ్ధుల్ని చేస్తుంది...
ఈ పంక్తులు చూడండి..

"మట్టి పొరల నిండా
చీకటే అయినా
బంగారంలా మారే
రస విద్య దాని సొంతం"

మట్టి మనిషి రూపం అయితే.. అతని పేదరికం చీకటి అవుతుంది.. అంత చీకట్లో కూడా.. ఒక మేధావి తన మేధా సంపత్తిని తప్పకుండా రెట్టింపు చేసుకుంటాడు.. అందుకు చీకటి ఏ విధంగానూ అడ్డంకి కాలేదు.. అన్న సత్యాన్ని భూమి చర్యతో పై విధంగా స్ఫురింప చేశారు కవి. ఈ కవిత నిండా చమత్కారాల రాశులే కాదు... మానవ జీవితంలో నిత్యం పలకరించే సత్యాలు కూడా కోకొల్లలుగా ఉన్నాయి.

ఈ కవిత ప్రతి అక్షరంలో తల్లి రూపమే దర్శనమిస్తోంది. బిడ్డలు ఎన్ని తప్పులు చేసినా.. ఎన్ని విధాల హింసించినా.. తల్లి ఒడి, తన బిడ్డలకు ప్రేమానురాగాలు పంచటానికి ఎప్పుడూ సిద్ధంగా ఉంటుందన్న సత్యాన్ని.. మట్టి ద్వారా మరోసారి ఇలా నిరూపిస్తారు కవి..

"బంతిని గోడకు కొడితే
ఎదురు తంతుంది
మట్టి అట్లాకాదు
మహోద్ధృత మమకారంతో
అక్కున జేర్చుకుంటుంది..."

ఈ ఆఖరి పంక్తులు పాఠకుల మనసు మీద శాశ్వత ముద్రను ముద్రించుకుంటాయి.. కేవలం తాను ఒక కవితను వ్రాశానన్న సంతృప్తిని కవికి మిగిల్చే సాహిత్యం.. ప్రయోజనకరమైన సాహిత్య మనిపించుకోదు... సత్యాసత్యాల ఆవిష్కరణలో.. చీకటి వెలుగుల ఉనికిని పాఠకులు చూపి.. ఒక ఆలోచనా మార్గాన్ని అందించే కవిత.. ఒక ప్రయోజనకరమైన కవిత అవుతుంది.. ఆ వరసలో మొదటి స్థానంలో నిలిచే కవిత "మట్టిరంగు" ♦

---

అక్టోబర్ 2012 సంచిక ముఖచిత్రం అందంగా ఉంది. అర్థం కాలేదు. జీవవైవిధ్య సదస్సుకు సంకేతమా? ఏమో! సరళీకృత గరళమా? కథాపత్రిక అనుకుంటున్న నాకు ఈసారి సాహిత్య విమర్శా, పరిచయ పత్రికగా కనిపించింది.

సాహిత్య కార్యశాల (పే.41) అన్నారు. లిటరరీ వర్క్‌షాప్‌ను వర్క్‌షాప్‌ను ప్రయోగశాల అంటే బాగుంటుందేమో!

కె. ఆనందాచారి సత్కృతిని సమీక్షించారు. (పే. 36,37) ప్రతి పేజీలో గిరిజా మనోహరబాబుగారి బొమ్మకంటె తెలంగాణ కట్టడాలు, చారిత్రక ప్రదేశాల బొమ్మలిస్తే బాగుండేదన్న సలహా శ్రేష్టమైంది.

**- సంగనభట్ల**

---

అక్టోబర్ 2012 సమర్థవంతమైన సంపాదకత్వం 'రవి గాంచనిచో కవి గాంచును కథ' అన్న నానుడికి చక్కని సమర్థీకరణ తెలకపల్లి రవి సంపాదకత్వం అని అక్టోబర్ సాహిత్య ప్రస్థానం తేట తెల్లంచేసింది.

విస్తృతమైన విజ్ఞానం, అపారమైన అనుభవం, సునిశిత పరిశీలనా శక్తి, సంపాదకునికి ఎంత సమర్థవంతమైన శక్తిని ఆపాదిస్తుందనటానికి అక్టోబర్ సంచిక ఒక మచ్చుతునక. అంతులేని విజ్ఞానం, అంతకుమించిన పరిజ్ఞానం, నిశితమైన బుద్ధీ, అంతకుమించిన బుద్ధి కుశలత సాహిత్య ప్రస్థానానికి ఒక విశేషమైన విలువను ఆపాదించిపెట్టాయి. అభ్యుదయ సాహిత్యానికి అడుగువేసి దారి చూపిన గురజాడ మంచి ముత్యపు సరములా వుంది. సాంప్రదాయ ముసుగులో బలవుతున్న అమాయక బకరాల దీనస్థితి శోచనీయం. గ్రియర్‌సన్ భాషా పటిమ, నైపుణ్యం, కౌశల్యం మనకు మార్గదర్శకాలు. చిన్న చిన్న పదాలతో పెద్ద పెద్ద అర్థాలు చెప్పిన నానీలు పఠనీయాలు. దేశభక్తి పూరితమైన చంద్రగుప్త నాటకం విద్యార్థులు చదవవలసిన పాఠ్యాంశం. మనిషి గతించిన ఆయన మనసు గతించలేదని దుశ్యంతు గజల్కు గల గల మంటున్నంత మనసులో మెరుగుపడిన ప్రేమాప్యాయతలు వాటికి తగ్గ ప్రేరణకు కలిసినప్పుడు మొలకెత్తుతాయి. సజీవ చిత్రాలవుతాయని బంధాలు అనుబంధాలను గూర్చి వివరించింది.

కిక్కునే కాదు మనసులో కడుపులో మంటలు రేపుతుందని చెప్పింది లిక్కరు మంటలు. ప్రజాస్వామ్యం ముడతలో ఎక్కడైనా మంచి వార్త కనపడుతుందేమో అని ఆశ చెందడం దురాశే అవుతుందేమో ! నిష్కామ కర్మతో, నిరంతర సేవా పారాయణతో, నిష్కలష్మమైన హృదయంతో పత్రికా సంపాదకత్వాన్ని ఒక పవిత్ర యజ్ఞంలా పరిగణిస్తూ, పత్రికా నిర్వహణ బాధ్యతను బాధ్యతాయుతంగా నిర్వహిస్తున్న తెలకపల్లి రవి గారికి సుమాంజలి. కావ్య హృదయానికి కవితాంజలి, కవితాత్మకు కర్పూరాంజలి.

**- డా. శివ భూషణం, కర్నూలు**

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**




ఫొటో: కొమ్మ్మాలపాటి సాహిల్
10 వ తరగతి, గౌతమ్ మోడల్ స్కూల్, హైదరాబాద్

49

SHAITYA PRASTHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.H/SD/415/10-12





**If Un delivered please return to :** Prasthanam, C/o M.H.Bhavan, Plot No. 21/1, Azamabad
Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020 (A.P), Ph: 040-27660013, Cell: 9490099059

50



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A143 |
| పుస్తకం పేరు | ప్రస్థానం నవంబర్ 2012 |
| తారీఖు | 25-5-24 |
| ముందు అట్ట | Yas |
| వెనుక అట్ట | Yas |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | KDaveeD |
| పేజీలు విడదీసినది | KDaveeD |
| స్కాన్ చేసినది | Gayatri |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | GOOD |